


వి.హిం.ప. (ప.ఆంధ్ర) ధర్మాచార్య సమ్మేళనం. వార్తలోపలి పుటలలో



వి.హిం.ప అఖిల భారత పదాధికార్లు మధుర సమావేశంలో (24,25,26-జనవరి - 97)

'విశ్వహిందు'
(ధార్మిక, సామాజిక మాసపత్రిక)

సంపుటి : 11 సంచిక : 3 ధాత – ఫాల్గుణం మార్చి - 1997

ప్రధాన సంపాదకులు :

ప్రొ. బి. రామరాజు

సంపాదకులు :

టంగళి సుందరరావు

సలహా మండలి :

శ్రీ పి.వి.యస్.నాయుడు

డా. కసిరెడ్డి వెంకటరెడ్డి

చందా వివరములు

విత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా – రూ. 50.00

విడిప్రతి – రూ. 5.00

డి.డి.లు 'విశ్వహిందు'

అని మాత్రమే పంపవలెను.

చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, "విజయశ్రీ"

కోఠి, భాగ్యనగర్ – 500 095.

ఫోన్: 517799, 591322.

ఈ సంచికలో ................ పుట

సంపాదకీయం ................ 2
ఆదర్శజీవనం ................ 4
ఆదిత్యహృదయం ................ 6
నవభారత నిర్మాణంలో గీర్వాణం ................ 7
విశ్వ ప్రేమ ................ 8
మనదేవాలయాలు ................ 9
విప్లవ సమరరాజు – సీతారామరాజు ........ 10
మొగలుల నెదిర్చిన మొనగాడు ............ 11
వ్యక్తి జీవితం – నేటి భారతం ............ 12
సైన్సులో భారతీయులు వెనుకబడి ఉన్నారా? 13
పీరోజి మహర్షి ................ 14
పంచకము – / యక్షప్రశ్నలు ............ 17
శివరాత్రి – యూరోపులు వి.హిం.ప. ...... 18
అజ్ఞానం ఎలా తొలుగుతుంది ............ 19
శ్రీ రుద్రమ్ ................ 20
విదేశీవార్తలు ................ 23
కబుర్లు ................ 26
ఆదినుండి ఆధునికం వరకు – స్త్రీ ........ 30
ప్రాంత ధర్మాచార్య సమ్మేళనం ............ 32
ఆంధ్రకేసరి ................ 33
దేశ వ్యాప్తంగా వి.హిం.ప. సేవాకార్యక్రమాలు 34
ఫరూక్ నోట పాకిస్తాన్ మాట ............ 35

ముఖచిత్రం: పార్వతీపరమేశ్వరులు గణపతితో

## సంపాదకీయం 'కన్నీరంతా మాతృభూమికే సమర్పితం'

పంచభూతాలైన భూమి, నీరు, వాయువు, అగ్ని,ఆకాశములు భగవత్ సృష్టి. అలాగే ఖగోళం, ఖగోళంలోని సూర్యచంద్రాది నవగ్రహాలు క్రమంగా గతిబద్ధంగా చరించడం భగవత్ శక్తి చిత్రం.

అదేవిధంగా సప్తసాగరాలు, మహా పర్వతాలు, వనాలు, నదీనదాలు ప్రకృతి వరాలుగా భగవత్ ప్రసాదాలు.

**84** లక్షల రకాల జీవారాసులు అన్నీ భగవత్ సృష్టి. అందు మానవుని బుద్ధి జీవిగా భూమిపై సృష్టించాడు ఆపరమాత్మ.

మహామౌనులు, ఋషీశ్వరులు తమ తపశ్శక్తితో సృష్టి రహస్యాన్ని, భగవత్ శక్తిని అనుభవించి, దర్శించి, దార్శనికులై విశ్వమానవాళికి వేదాలు వెలయింప జేశారు.

శ్రీవ్యాస మహర్షి వేదాలు కూర్చి మానవ కర్మకాండ, శాస్త్రజ్ఞానం, సాంకేతిక జ్ఞానము, సామగానము మొదలగువాటిని విపులంగా విశదీకరించారు మంత్రరూపంలో. (దేశమంటే మట్టి కాదోయ్ - మనుషులోయ్' అన్నారు గురజాడవారు.) దేశమంటే మట్టి - మనుషులు కూడా-

'ఉపసర్ప మాతరంభూమిమ్' అని వేదం ఆదేశిస్తూ,సమస్త ప్రకృతి, పంచభూతాలు జీవులను రక్షించుగాక,అన్నది. అందుచేత మాతృభూమిపై భక్తి శ్రద్ధలు కలిగి బుద్ధి జీవియైన మానవుడు కృతజ్ఞతతో ఉండాలని నిర్దేశిస్తున్నది వేదం.

కనుక అట్టి వేదా దేశాన్ననుసరించి మానవుడు మాతృభూమి,

సత్సంతానమై,దేశభక్తి పూరితులై దేశం కొరకు శ్రమించి కర్తవ్య నిష్టులుకావాలన్నది నిర్వివాదమైన సత్యం. లేనినాడు అ బుద్ధి జీవి మాతృద్రోహిగా,దేశద్రోహిగా చరిత్ర పుటలలోనిలిచి పోతాడు.

అది గుర్తెరిగిన మన మహానాయకు లెందరో భారత స్వాతంత్ర్య సముపార్జనకై తమ శక్తి,తను, మన, ధన, ప్రాణాలర్పించారు.

అట్టివిధి నిర్వహణలో మాండలే జైలులో మ్రగ్గుచున్న మా॥ శ్రీ బాల గంగాధర్ తిలక్ గారికి ఓనాడు ఓతంతి అందింది. ఆ తంతిలో తన ధర్మ పత్ని దివంగతు రాలైనట్లున్నది. అయినా కించిత్తుగూడ చలించని తిలక్ మహనీయుని జైలు అధికారి గమనించి " ఏమండీ మీ భార్యగతించినా మీ కంట ఒక్కకన్నీటి బొట్టు గూడా జారలేదే" అనగా " మాతృభూమికై ఇదివరకే కన్నీటి ధారలన్నీ సమర్పించాను. భార్యాబిడ్డల కుఒక కన్నీటి చుక్కగూడా లేదన్నారు తిలక్ మహాశయుడు. అదీ దేశభక్తి - మాతృభక్తి- మానవ నిష్ఠ - కర్తవ్యదీక్ష.

నాటి నాయకత్వానికి - నేటి నాయకత్వానికి గలతారతమ్యం నేడు అందరెరిగినదే.

తిలక్‌లాంటి మహనీయుల అడుగుజాడలు నేటితరానికి ఆదర్శం కావలెనన్నది ప్రతి భారతీయుడు గుర్తించి, ఆచరించవలసియున్నదనేది అత్యంత ప్రధానంకదూ! ఆలోచించండి !

- జైహింద్

**దేశభక్తి కన్న దేవుడుకడుచిన్న!**
**మాతకన్న మిన్న మాతృభూమి!!**
**గుర్తెరింగి జనులు కూడి చరించగా,**
**విశ్వహిందు వాణి వినుడు వినుడు.**

**- సుందరం.**

# ఆదర్శ జీవనం

- జగిత్యాల చంద్ర మౌళిశాస్త్రి

మన మందరమూ జీవిస్తున్నాం. ప్రతిదీ ప్రశ్నించుకొని దానికి తార్కికమైన, హేతుబద్ధమైన, కారణాలను అన్వేషించి, వొక నిర్ణయానికి రావటం భారత సంస్కృతి యొక్క లక్షణం. ఏదీ కూడా మూర్ఖంగా విశ్వసించకపోతదైనంత మాత్రాన దాన్ని ఆదరించటమో, ముందు వెనుకలాలోచించకుండానే కొత్తగా కనబడిందల్లా అనుసరించటమో - యీ జాతి లో లేనే లేదు.

మఱి మనం ఎందుకు జీవిస్తున్నాం? పుట్టినాం కనుక జీవిస్తున్నామని నాస్తికులంటారు. అలా జీవించనక్కఱలేదు. పుట్టకుండానే వుండవచ్చుగదా! అంటే ''అలా పుట్టకుండా వుండటం నాచేతిలో లేదు'' అని అనవలసి వస్తుంది అదేనాస్తికుడు. అంటే యింకేవరి చేతిలోనే వున్నదని అర్థం. ఇంకే శక్తికోలోబడి వున్నదని భావం.

సరే! జీవిస్తున్నాం. ఏవిధంగా జీవించాలి? ఏ విధంగా యేమిటి? తినాలి, తాగాలి,సంపాదించాలి. ఆకర్షణీయంగా రూపాన్ని తీర్చిదిద్దుకోవాలి. మెత్తని పడకపై పడుకోవాలి. సుగంధాలు పూసుకోవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే ఇంద్రియ సుఖాలన్నీ అనుభవించాలి అంటారు పాశ్చాత్యులు. అంతేకాదు. అవసరమైతే ఈ సుఖాలను అనుభవించేందుకు ఎదుటి వాణ్ణి మోసం చేసైనా, హింసించి అయినా మన పబ్బంగడుపు కోవాలంటారు వాళ్లు.

హిందూ జీవన పద్ధతిలో అందరూ సుఖాలను పరిత్యజించాలని యేమీ చెప్పలేదు. అయితే తనతోబాటుగా ఇతరులందరూ కూడా సుఖంగానే వుండాలని కోరుకొనుట ఈ జాతి జీవనంలోని మౌలిక సూత్రము. ఇంకోరకంగా చెప్పాలంటే మిగతా అందరూ సుఖంగా వుండుటతోనే తన సుఖం కూడా ఇమిడి వుండగలదనే సత్యాన్ని కనుక్కున్నది యీ దేశపు సంస్కృతి. ''సర్వేజనాః సుఖినోభవన్తు'' అనే దృక్పథం మరే సంస్కృతిలోనూ కనబడని విశేషం. స్వసుఖాలను తుచ్ఛంగా భావించినారు యీగడ్డపై పుట్టిన మహానుభావులు.

సుఖం అనేది వస్తువులపై సౌకర్యాలపై ఆధారపడి వుంటుందనేది విజాతీయుల నమ్మకం. కాదు-అది మనోనిష్ఠమనేది మన విశ్వాసం. పాశ్చాత్యీకరణతోబాటు సౌకర్యాలూ రోజురోజుకూ పెరిగిపోతూనే వున్నా వాంఛా పరితృప్తి లేకపోవుట మనం గమనిస్తూనే వున్నాం. పైగా జ్వాలలో ఆజ్యం పోసినట్లు వాంఛలు పెరిగి పోతూనే వున్నాయి; తృప్తి లేదు. మఱి మన పురాణ పురుషులు ఎటువంటి వారు?

ఆ భగవంతుడే తనకు ప్రత్యక్షమై నాయనా! నీకేం కావాలో కోరుకొమ్మన్నప్పుడు ప్రహ్లాదుడిలా అన్నాడు.

యదిరాసీశ మే కామాన్ వరాంస్త్వం వరదర్షభ<br>
కామానాం హృద్య సంరోహం భవతస్తు తృణేవరమ్॥

విశ్వహిందు - మార్చి - 1997

హే! భగవాన్! ఒక వేళ నాకు వరాలివ్వాలనే గనుక తమకు వుంటే, నా మనస్సులో అసలు కోరికలే మొలకెత్తకుండా వుండే వరం యివ్వండి - అని చూడండి. మనం కోరికలు నెరవేరాలని మొక్కుకుంటాం. తిరుపతి కొండకు వెళ్లుతాం. ఉపవాసాలు చేస్తాం. నానా హంగామా చేస్తాం. అలాంటిది సాక్షాత్తు తన ఇష్టదైవం శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమవటమే కాక కోరిన వరాలల్లా కూడా యిస్తానంటే - అసలు కోరికలే తలెత్త కూడదన్నాడు, భక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదుడు. ఉజ్జగించిన కొద్దీ కోరికలు దినదిన ప్రవర్ధమాన మవుతాయి. వాటిని ఖండించటమే మన సంస్కారం. అదే మన ఆదర్శం. నాగరికత వేషంలోనూ, ఆడంబరాల్లోనూ, దర్పాన్ని చాటుకోవటంలోనూ ప్రతిఫలించేది కాదు. వినయం, మనస్సును ప్రసన్నంగా వుంచుకోవటం,చేతనైనంతవఱకూ సమాజసేవ చేయుటం, తన అవసరాలను తగ్గించుకోవటం, నశించిపోయే యీ శరీరానికి వీసమెత్తు ప్రాముఖ్యం యివ్వక ఉన్నతమైన ఆశయాల కోసం జీవించటం ఇవీ మన మూలపురుషులు ఆచరణాత్మకంగా మనకు బోధించిన నిత్య సత్యాలు.

---

# 200 మంది హిందూధర్మంలోకి

**పునరాగమన కార్యక్రమం :**

తేది 20-2-97 నాడు ఉదయం 9 గంటలకు సహకార బ్యాంక్ ఆవరణ నల్కి వెంకటాపురం (దండేపల్లి మండలం) గ్రామమునందు పరిషత్ ఆధ్వార్యాన పునరాగమన కార్యక్రమం ప్రారంభమైంది.

గోపూజ తదు పరిసంస్కారవిధి, హవనములో సుమారు 50 కుటుంబాలు మొత్తం 200 మంది స్త్రీ, పురుషులు క్రైస్తవం వదిలి హిందూ ధర్మంలోకి ప్రవేశించారు. ఈ పునరాగమన కార్యక్రమంలో విశ్వహిందూ పరిషత్ ప్రాంత ప్రధాన కార్యదర్శి శ్రీ మంచెన గుండేరావు గారు ప్రసంగించారు. మొదట శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద స్వామిగారు సంస్కార్యులను ఆశీర్వదించిరి. మంచిర్యాల విశ్వహిందు పరిషత్ పెద్దలు సంస్కార్యులకు వస్త్రదానం చేసిరి. తదుపరి అందరికి సహపంక్తి భోజనం జరిగింది.

సాయంకాలం 5 గంటలకు శ్రీ R. చంద్రకాంత్ ప్రాంత భారతీయ జన సేనా సమితి అద్యక్షులు భారతీయ జనసేవా సమితి ఆద్వర్యాన సభకు ఆద్యక్షత వహించిరి. అందు ప్రాంత విశ్వహిందు పరిషత్ కార్యద్యక్షులు డా. ఎమ్.వి. ఆర్. శర్మగారు శ్రీ టి.కె. ఎన్. చారిగారు శ్రీ డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు, మాట్లాడిరి. పరిషత్ ప్రాంత ఉపాద్యక్షులు శ్రీమతి గారు తదితరులు ప్రసంగించిరి.

చివరకు గంగాజలం సంస్కార్యులపై ప్రోక్షిస్తూ శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానంద స్వామిగారు భగవద్గతలు బాలాజి ఫొటోలు వితరణ చేసిరి.

శ్రీ వి. ధామచంద్ర రావు కార్యాద్యక్షులు గారి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది. అని ప్రాంత ధర్మ ప్రసార ప్రముఖ్ శ్రీ చొడూరి గోపాలరావు తెలియజేశారు.

# ఆదిత్య హృదయం

- డా. అల్లూరి వెంకటనరసింహారాజు

భారతీయుల శాస్త్రజ్ఞానం అపారమైనది; అపూర్వమైనది. సూర్యునికి ఉదయాస్తమయాలు లేవని ఋగ్వేదం చెప్పింది. సూర్యుని కిరణాలు ఏడు విధాలని అధర్వణవేదం పేర్కొంది. భూమి ఆత్మ భ్రమణమే సూర్యచంద్ర గ్రహణాలకు కారణమని ఆర్యభట్టు చెప్పాడు. చంద్రునిలోని ఒక దిశ కాంతివంతంగా ఉంటుందని రెండవ ప్రక్క చీకటిగా ఉంటుందని వరాహమిహిరుడు పేర్కొన్నాడు. అంతెందుకు అసలు సౌరశక్తిని తొలుత గ్రహించిన వారు భారతీయులే! ఐతే ఒకటే చిక్కు. ప్రాచీన శాస్త్ర విషయాలన్నీ సంస్కృత భాషలో సూత్రాలుగాను మంత్రాలుగాను రూపొందించబడి ఉన్నాయి. అవి ఆధునికులకు అంత సులభంగా అర్థం కావడం లేదు.

దేని అర్థమైతే స్పష్టంగా కనిపించకుండా పదాల అంతరాంతరాల్లో నిక్షిప్తమై యుంటుందో అదే మంత్రం. అనాదిగా ఉంటూ, కాలవశాత్తు మరుగున పడిన విషయాన్ని పునరుద్ధరించి తిరిగి లోకానికి అందించేవారే మహర్షులు.

అతిలోక వీరుడు శ్రీరామునికి ధనుస్సు. అస్త్రాలు యిచ్చినవాడు అగస్త్యుడు. ఆర్యావర్తనం నుండి దక్షిణాదికి వచ్చి, అక్కడి అనాగరికులను ఉద్ధరించడం కోసం తమిళ భాషకు వ్యాకరణం వ్రాసినవాడు అగస్త్యుడు. శరత్కాలంలో ఆకాశాన ప్రత్యక్షమై నదీజలాలలో బురదను విరిచి స్వచ్ఛతను చేకూర్చే నక్షత్ర రూపుడు అగస్త్యుడు.

విద్యపట్ల ఆసక్తి, విశ్వాసము, ఏకాగ్రత, జ్ఞాపకశక్తి, ఆచరణ, లోక శ్రేయస్సు కోసమే దానిని వినియోగించే స్వభావము కలవాడే మంత్రోపదేశానికి అర్హుడు. ఆ లక్షణాలన్నీ శ్రీరామచంద్రునిలో పుంజీభూతమై ఉన్నాయి.

మర్యాదా పురుషోత్తముడైన శ్రీ రామచంద్రునికి, విద్యామండల గురువైన అగస్త్యుడు, ఉపదేశించిన మంత్రరాజమే '' ఆదిత్య హృదయం''.

మానవ ప్రాణానికి సూర్యలోకానికి మధ్యగల మనో శారీరక సంబంధాలను, అనుబంధాలను, ప్రయోజనాలను సంకేతాలతో కూర్చిన దివ్యమంత్రమే ఆదిత్య హృదయం.

సూర్యవంశంలో జన్మించిన శ్రీరామచంద్రుడు, తండ్రి ఆజ్ఞానుసారం జానకీ లక్ష్మణ సమేతుడై దండకారణ్యానికి పోయి, అక్కడ పర్ణశాలలో నివసిస్తున్నాడు. శూర్పణఖ ద్వారా సీత రూపలావణ్యాలను గూర్చి విన్న రావణాసురుడు, ఆమెను చెఱబట్టి లంకలో ఉంచాడు. రాముడు తన భార్యను తన కప్పగించమని రాయబారం పంపినా, అతడు లక్ష్యపెట్టలేదు. ఘోరమైన తపస్సు చేసి. పరమేశ్వరుని మెప్పించి, ఆయన అనుగ్రహానికి పాత్రుడైన రావణుని, నిర్జించడం అంత తేలికైన పనికాదు. అందునా, రాముడు తన దివ్యత్వాన్ని వ్యక్త పరచకుండా మానవ మాత్రునిగానే వ్యవహరిస్తున్నాడాయె!

భీకరమైన యుద్ధంచేసి, అలసి, కలత చెందియున్న శ్రీరాముని దర్శించడం కోసం వచ్చిన

అగస్త్యుడు, '' ఓ రామా! మీ వంశమూల పురుషుడు, ప్రత్యక్ష దైవము అయిన, ఆదిత్యుని స్తుతించి, శత్రుజయము పొందు'' అని సూచించాడు. శ్రీరాముడు అందుకు సంసిద్ధుడయ్యాడు.

మహా భారత యుద్ధంలో, అర్జునుని నిమిత్త మాత్రంగా గైకొని, శ్రీ కృష్ణ పరమాత్మ, మానవాలికి గీతోపదేశం చేశాడు. అలాగే, లీలామానుషవిగ్రహుడైన శ్రీరామచంద్రుని మిషగా, గొని, అగస్త్యమహర్షి, ఆదిత్య హృదయాన్ని ప్రపంచానికి అనుగ్రహించాడు.

నిజానికి, ఆదిత్య హృదయం భగవద్గీత కంటె, ఎంతో ప్రాచీనమైనది; ప్రశస్తమైనది. ప్రపంచానికే ఆదికావ్యమైన వాల్మీకి రామాయణంలోని యుద్ధ కాండలోని, నూటయేడవ సర్గ అది. అసలు వాల్మీకి రామాయణమే వేద తుల్యమైన, మహిమాన్వితమైన, గాయత్రీ మంత్ర బీజయుక్తమైన పారాయణ గ్రంథం. అందు మకుటాయమానమైన భాగం ఆదిత్య హృదయం.

(సశేషం)

---

# నవ భారతనిర్మాణంలో గీర్వాణం

పఠతు సంస్కృతం - వదతు సంస్కృతం
జయతు సంస్కృతం - జయతు భారతం

జ్ఞానవైభవం - వేదవాఙ్మయం
ముని జన సంసేవితం - అ ఖండ భారతం

వాల్మీకి విరచితం - పవిత్రరామ చరితం
వ్యాసేన ప్రణీతం - మహాభారతం

వివేకేన పూరితం - హైందవ శంఖారావం
బుద్ధాయ ప్రభోదితం - పంచశీలనవ పథం

కులమత మారణహోమం - సంస్కృతేన నివారితం
సామాజిక సమభావం - సంస్కృత స్వభావం

దేశస్య అఖండత్వం - సంస్కృతేన సాధితం
నవభారత నిర్మాణం - గీర్వాణే సాధితం

- చౌడూరి నరసింహారావు

## వేదసందేశము విశ్వప్రేమ

-పి. వి. రమణారెడ్డి.

సహృదయం సామనస్య మవిద్వేషం కృణోమివః
ఈన్యో అన్యమభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా
అథ. -3-30-1

ఓ మానవులారా! మిమ్ములను సహృదయత్వమను సూత్రముతో కలుపుచున్నాను, మీ అందఱకు ఒకే హృదయము, సమానమైన హృదయము కలుగునట్లు ఏర్పాటు చేయుచున్నాను. మీ చిత్తములు ఏకమై ఉండునట్లుగాను, పరస్పరము ద్వేషభావ రహితముగా నుండునట్లుగాను, చేయుచున్నాను. ఓ విశ్వమానవులారా! అప్పుడే పుట్టిన బిడ్డయందున్న ప్రేమ గోవును బిడ్డవైపు ఆకర్షించునట్లుగా, మీరును ఒకరిమీద ప్రేమతో వ్యవహరించుచు ఉండగోరుచున్నాను. దూడను ఆవు ప్రేమించుటలో స్వార్థమేమియు ఉండదు. అలాగుననే నిస్వార్థముగా ప్రేమించుకొనుడు. ద్వేషించుట వేదము మనకు నేర్పదు. ఏమి చెప్పుచున్నదో చూడుడు.

ఉతదేవా అవహితం దేవా ఉన్నయథా పునః
ఉతాగశ్చ క్రుషం దేవా జీవయథా పునః
అథర్వ - 4-13-1

దివ్యగుణ సంపన్నులైన మహాపురుషులారా! పతితులైన వారిని ఉద్ధరించుడు. మాటిమాటికి వారిని ఉద్ధరించుటకై ప్రయత్నింపుడు. అపరాధములు, పాపములు చేయువారిని గూడ- క్షమించి, వారికి ఉన్నతి మార్గమును చూపింపుడు. ఓ ఉదార పురుషులారా! పాపాచరణము చేయు వారిలో- ఆత్మజ్యోతిని వెలిగించుడు.

మా అభిద్రుహః (అథర్వ -9-5-4)

ఓ మానవుడా! విశ్వమునగల ఏ మానవునికి గాని ప్రాణికి గాని ద్రోహము చేయరాదు. ఈర్ష్యను చూపించకు. ద్వేషమును ప్రదర్శించకు,

---

## సంస్కృత సమ్మేళనం

భారత సంస్కృత పరిషద్ ఏర్పాటు చేసిన భాగ్యనగర సంస్కృత సమ్మేళన కార్యక్రమం కేశవ మెమోరియల్ హైస్కూల్‌లో 23-2-97 సాయంకాలం 3 గం॥కు జరిగింది. అందులో భాగ్యనగర్ సంస్కృత ఆచార్యులు, విద్యార్థులు 73 మంది పాల్గొన్నారు. అందులో కందాడై రామానుజాచార్యులు, ఆకాశవాణీ సంస్కృత ప్రసార అధిపతి శేషం రామానుజాచార్యులు వి.హిం.ప. ప్రాన్త కార్యాధ్యక్షులు శ్రీ ఎమ్.వి. ఆర్. శర్మ, సంస్కృత విభాగ కేంద్ర సహమంత్రి శ్రీ లక్ష్మీనాధాచార్యులు పాల్గొన్నారు. విశేషంగా విద్యార్థులు సంస్కృతంలో మాట్లాడటం జరిగింది. ఆచార్యులు సంస్కృతి

త వాతావరణం తేవడానికి తమ వంతు కృషిని వి.హిం.ప పరంగా చేస్తామని వాగ్దానం చేశారు. ప్రాన్త సంస్కృత సంయోజిక కాంతాజీ మే మాసంలో మరల ఈ కార్యక్రమం 4వ తేది ఆదివారం వి.హిం.ప.కార్యాలయంలో జరుగుతుంది అని ప్రకటించారు. శ్రీ ఉపేంద్రగారు ప్రాంత సంస్కృత ప్రముఖ్‌గారు కార్యక్రమ పర్యవేక్షణ చేశారు.

-కాంతాజీ.

# మనదేవాలయాలు

## విదేశీదురాక్రమణదారులు మందిరాల స్థానంలో నిర్మించిన కట్టడాలు - ఇవి అవమానాలా- ఆభరణాలా?

ఆంధ్రప్రదేశ్

హైదరాబాద్‌జిల్లా:

చిలకలగూడాలోని మసీదు **1610**, షావలీకి దర్గా **1601-2**, బాలహిసార్ మందిరంపై గోల్కొండలో నిర్మించిన జామా మసీద్, గోల్కొండలోని తారామతి మసీదు, షామూసా కాదిరీకి దర్గా, పీరుల కొండపై ఉన్న మసీదు **1690**, టోలీ మసీద్**1671**, మియా మిష్కికి దర్గా **1680**, మోమిన్ చుప్‌కీ దర్గా (అలియాబాద్) **1322-23**, హాజీ కమాల్‌కీ మసీద్ **1657**, ఇస్లామ్ ఖాన్ నక్షబందీకీ దర్గా, షాదాపూర్‌కీ దర్గా **1369-70**, జామా మసీద్, మైసారంలోని మసీదు (గోల్కొండను గెలుచుకున్నాక **200** మందిరాలను కూల్చి ఔరంగజేబు నిర్మించారు.) సికింద్రాబాద్‌లోని కదమ్‌రసూల్, షేక్‌పేటలోని షేక్‌కీ మసీద్ **1633-34**, సరాయ్‌వాలీ మసీద్ **1678-79.**

**కరీంనగర్ జిల్లా.**

ధర్మపురి మసీద్, కాళేశ్వరంలోన అలంగిరీ మసీద్, సోనీ పేట్‌లోని అలంగిరీ మసీద్, వేములవాడలోని మజార్,

**కడప జిల్లా**

కడపలోని భాప్ సాహెబ్‌కీ మసీద్, ఈద్గా, బహదూర్‌ఖాన్ కా మసీద్, దువ్వూరులోని మసీద్, గండికోటలోని జామా మసీద్, జమ్మలమడుగులోని జామామసీద్, జంగాలపల్లి దస్తగిరిస్వామి దర్గా,

తూర్పుగోదావరి జిల్లాలోని బిక్కవోలు మసీద్,

**కర్నూల్ జిల్లా**

ఆదోని లోని జామామసీద్, ఆదోని కొండపైనున్న మసీద్, కొత్తకోట జామామసీద్, కర్నూల్‌లోని పీర్‌సాహెబ్‌కా గుంబజ్, జామామసీద్, లాల్‌మజార్, సిద్దేశ్వరంలోని అషూర్‌ఖానా, ఎడవల్లిలోని మదారు, మసీద్.

**మహబూబ్‌నగర్ జిల్లా**

అలంపురం,. కొడంగల్, కుందుర్గ్, పరిగి, సోమశిల, లలోని మసీదులు దర్గాలు.

**మెదక్ జిల్లా**

అందోల్, మెదక్, పటాన్ చెరువులలోని ముస్లిం కట్టడాలు.

నల్గొండలోను దేవరకొండలలోను అనేక మందిరాలు మసీదులుగా మారాయి.

# విప్లవసమరరాజు - అల్లూరి శ్రీ (సీతా) రామరాజు

(బ్రిటీష్ పాలకులను గెరిల్లా యుద్ధముతోనెదుర్కొన నిశ్చయించిన సమయంలో తల్లీ-తనయుల సంభాషణ ఇది)

తల్లి: నాయనా! శ్రీరామరాజు! ఈ పని నీకెందుకు? ప్రభుత్వమును జయించుట కష్టము కాదా? బ్రిటీష్ ప్రభుత్వం వచ్చిన తర్వాత రోడ్లు, రైళ్ళు వేయించి అనేక సదుపాయములను చేసిరి. యుద్ధ ప్రయత్నము విరమించుకొమ్ము''.

శ్రీరామరాజు: అమ్మా! నేను క్షత్రియుడనై జన్మించితిని. క్షత్రియుడుచేయవలసిన పనియేమి? క్షతమునుండి రక్షించు వాడు క్షత్రియుడని చెప్పిరి. ఏ హిమాలయములకో పోయి తపస్సు చేసికొందమన్న మీరు అడ్డు వచ్చిరి. అందుచే ఇట్లుండవలసి వచ్చినది. ఈమధ్య ప్రజల కష్టములు చూచుచుండగా నాకు మనశ్శాంతి లేకున్నది. తినుటకా వారికి సరియగు తిండి సంవత్సరమంతయు నుండదు. వారికేమియు దొరకనప్పుడు మామిడి జీడి అంబలి, చింత గింజల అంబలి గూడ త్రాగుచుందురు. మన్య ప్రాంతమున గూడ తాండవించు బ్రిటీష్ ప్రభుత్వ నిరంకుశత్వము సహింపలేకుండా ఉన్నాను. నాకు మూడే మార్గములు కలవు. ఒకటి, హిమాలయములకు పోయి తపస్సు చేసికొనుట, అట్లు చేయుటకు వివాహము చేసికొనకున్నను మీ అడ్డము వచ్చినది. మీరు విచారించుచున్నచో తపస్సు వలన ఫలితము శూన్యము. అందుచే ఆ పని మానవలసివచ్చినది. ఇక రెండవది, ఇచ్చట ఉండి ప్రజలతో సంబంధము పెట్టుకొనుటచే వారి కష్టములు చూచి సహింపజాలకున్నాను. అందుచే శివాజి వలె గెరిల్లా యుద్ధము చేయక తప్పదు. బ్రతికియున్నచో ఈమన్య ప్రాంతమునకు స్వాతంత్ర్యము చేకూర్చి ప్రజల కష్టములను తీర్చెదను. మూడవది, అట్లు చేయలేనిచో స్వర్గమునకు బోదును. నాజాతకమున గూడ అట్లున్నది.

''హతోవా ప్రాప్యసే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్

తస్మాదు త్తిష్ఠ కాంతేయ యుద్ధాయ కృతనిశ్చయః॥''

అని కదాకృష్ణుడు అర్జునునికి బోధించెను. అందుచే విజయమో వీరస్వర్గమో ఇదియే నా నిశ్చయము.''

(1897 - 1997 సీతారామరాజు శతజయంతి సంవత్సర సందర్భంలో సంస్మరణ.) - సం.

---

''తనతండ్రి వాక్యములను ధిక్కరించి స్వేచ్ఛగా వ్యవహరించునట్టివాడు జీవించియు మృత కల్పుడే. అట్టివాడు మరణానంతరమునరకములకు పోవును.''
''మహాపురుషులు నరకముకన్న అసత్యమునకే అత్యధికముగా భీతి చెందుదురు''.

-అయోధ్య శ్రీరామచంద్రుడు

''త్యాగమువల్లనే మానవజీవితానికి మాధుర్యము చేకూరుతుంది. ఐహికమునందుగాని ఆముష్మికమునందుగాని ఈ మాధుర్యమే మానవుని సంరక్షిస్తుంది.''

-భగవాన్ శ్రీశ్రీశ్రీసత్యసాయిబాబా



# మొగలులనెదిర్చిన మొనగాడు

శివాజి తన 14, 16-వ ఏటనే పూనాపరిసర ప్రాంత భూమియైన తన చిన్న జాగీరును చక్కదిద్ది, 12 మండలాలుగా విభాగించి, విశ్వాసపాత్రులైన వీరబృంద సహాయంతో తోరణ మొదలైన సుప్రసిద్ధ దుర్గరాజములను, సమయోచిత సాహసోపేతమైన మెరుపువంటి దాడులతో స్వాధీనపరచుకొన్నాడు. బిజాపూరు సేనాపతి అఫ్జుల్ ఖాను సేనలను తీవ్రముగా ఓడించి, సుస్థిర .జయాన్ని పొందిన తర్వాత మొగలులనుగూడ బహిరంగముగ ఎదిరించినాడు. ఒకప్పుడు లొంగినను- ఒకప్పుడు మోసగించినను సదా వారికి పైచేయియై మొగలు ఉపసేనాపతులు-సేనాపతుల చాలమందిని పరాభూతుల జేసి శత్రువులకు గుండెదిగులు పుట్టినందున మొగలు సమ్రాట్టు ఔరంగజేబు గూడ కొంతకాలము విరోధము మానుట వివేకమనుకొని, కపటోపాయాలతో శివాజీని చేచిక్కించుకొనజూచినాడు. కాని, మయావియైన ఆ ఔరంగజేబు పాదుషా క్షాత్రియోపాయాలకు శివాజీ అందలేదు. ఆగ్రాలో అతడు పన్నిన విఘాతుక యత్నాల భగ్నముచేసి, నిరపాయంగా బంధవిముక్తిని బొంది సురక్షితంగా రాయగడము చేరినాడు.

రాయగడమునుండి మొగలులతోడి యుద్ధమును మరల సాగించి, శివాజి సింహగడమును స్వాధీనపరచుకొన్నాడు. ఎదిరించిన పాలికలనులోనెల్ల మహమ్మదీయులను ఓడించి, చాలమంది మహారాష్ట్ర సేనాపతులు పేర్గాంచినారు. చివరకు, హిందూధర్మ సంస్థానాచార్యుడు, హిందూ నాగరికతా సంరక్షకాచార్యుడు, హిందూ నాగరికతా సంరక్షకాచార్యుడు అయిన హిందూచత్రపతిగా తాను రాజ్యాభిషేకము నొందుట భద్రమని శివాజీ తలంచినాడు. విజయనగర పతనానంతరము ఏ హిందూ రాజుగాని ఒక స్వంతంత్ర పాలకుడుగా ఛత్రపతిగా పట్టాభిషిక్తుడగుటకు సాహసించలేదు. ఈ పట్టభద్రాభిషేక సమయ శంఖారావము మహమ్మదీయ అస్త్రాధిక్య శక్తిని భిన్నవము చేసినది. అది మొదలు ఏనాడు గాని యుద్ధభూమిలో హిందువుల ఎదుట మహమ్మదీయులు నిలువలేక పోయినారు.

మూలం: వీరసావర్కార్; తెలుగు సేత కోదండరామిరెడ్డి (మార్చి 27 శివాజీ జయన్తి)

## మాస విశేషాలు

**మాఘం - పాల్గుణం (మార్చి-97)**

5. శ్రీగురూజీ జయంతి.
7. మహాశివరాత్రి
18. స్వామిదయానంద జయంతి
23. భగత్‌సింగ్, సుఖ్‌దేవ్ రాజగురుల బలిదాన్ దివాస్
24. హోలీ.
27. శివాజీజయంతి

**ఫాల్గుణం - చైత్రం ( ఏప్రిల్-97)**

8. ఉగాది - ఈశ్వర నామ సం॥ - డాక్టర్జీ జయన్తి, ఆర్యసమాజ్ స్థాపన్
13. జలియన్‌వాలాబాగ్ సంస్మరణ - రమణమహర్షిజయంతి.
14. అంబేద్కర్ జయంతి
16. శ్రీరామ నవమి-సమర్థరామదాసు జయంతి.
20. మహావీరజయంతి.

## 'వ్యక్తి-జీవితం'

– ప.పూ. శ్రీగురూజీ.

''మనగుణగణాలు వ్యక్తి జీవితంలో సువ్యక్తం కావడమే కాక సమష్టి జీవనంలో ఆచరణయోగ్యమైన పద్ధతిలో సుస్పష్టం కావాలి. ఇది అత్యంత ఆవశ్యకం.

దీనికోసం వ్యక్తులు ఒకరితో ఒకరు తాదాత్మ్యాన్ని పొందుతూ సమిష్టితో కూడా సమరసం కావాలి.

స్నేహపూరితము, విశ్వాస సహితము, ఆదరయుక్తము అయి పరిపూర్ణమైన ఆచరణ మన జీవితంలో ప్రస్ఫుటంకావాలి. ఇందులో సాఫల్యాన్ని పొందితీరాలి. ఇట్టి తేజోవంతమైన సౌకర్యానికి బాహ్యపరిస్థితుల వల్ల అడ్డంకులు ఏర్పడడం అసంభవం. ఇది నా ప్రగాఢ విశ్వాసము.

ఈ విశ్వాసాన్ని మీ అంతఃకరణలలోకూడా ప్రతిష్ఠించుకోండి. మన కార్యం విజయవంతమై తీరాలి, అయితీరుతుంది, శక్తి సంపన్నంకూడా అవుతుంది. అప్పుడు ఎల్లెడల సంఘ కార్యానికి జేజేలు పలుకుతారు.

మనభారతదేశాన్ని ఏవిధంగా తీర్చిదిద్దాలని ఆశిస్తున్నామో ఆవిధంగానే రూపొందితీరుతుంది''.

*(మార్చి 5, ప.పూ. శ్రీగురూజీ జయన్తి).*

---

## నేటి భారతం - 2

–డి.వి.ఎమ్. సత్యనారాయణ

సీ॥ కాశ్మీర మనగానే, కాల్చివేతలెగాని
కమ్మదనమునేడు కాంచమయ్యె
న్యాయమూర్తులమాట నానాటికీ చోట
నేతి బీరలలోని నెయ్యి యయ్యె
బస్సులు రోడ్లను వదలిమహాజలా
శయములందుబడులు సహజమయ్యె
మద్యంబు నమ్మక మనప్రభుతమనని
చెడ్డ కాలమునేడు చేరువయ్యె.
తే. గీ॥ ఎచట జూచిన హింసయే ఎక్కువయ్యె
జనుల బాగుకన్నను తన జానపొట్ట
నిండవలయు ననెడి అవినీతి హెచ్చి
మనదు దేశ చిత్ర మిటుల మారిపోయె॥

ఉ॥ వాములు మ్రింగు స్వాములకు పచ్చని గడ్డొక లెక్క యాయనన్
ఏమియు సిగ్గులేక ధనమెవ్విధియైనను వెన్కవేసియున్
కామిత మందుటే పరమ కార్యముగా తలపోయువారలే
స్వాముల స్వాములై మనకు కన్పడు చుండిరి భారతావనిన్॥

# సైన్సులో భారతీయులు వెనుకబడి ఉన్నారా?

-పోలిశెట్టి బ్రదర్స్

సైన్సు రంగంలో భారతీయులు వెనుకబడి ఉన్నారనే తప్పుడు అభిప్రాయం మనలో చాలామందికి ఉంది. భారతీయుల మేధాశక్తి ఏ రంగంలోనూ తక్కువ కాదు. (ఆధునిక కంప్యూటర్ రంగంలో భారతీయులు ప్రపంచంలో అగ్రగణ్యులుగా వెలుగొందుతున్నారు. మనదేశాన మన శాస్త్రవేత్తలు ఈ మధ్య తయారుచేసిన 'పరమ్' అనే సూపర్ కంప్యూటర్, ప్రపంచాన గల అతిగొప్ప కంప్యూటర్స్‌లో ఒకటి.) ఆధునిక గణాంక వివరాల ప్రకారం ప్రపంచ మేధావుల శాతంలో భారతీయ మేధావులు ఒక ఉన్నతమైన ప్రత్యేకస్థానాన్ని కలిగి ఉన్నారు. ప్రపంచంలోని అనేక దేశాల్లో లక్షల కొలదీ భారతీయ మేధావులు స్థిరనివాసాలు ఏర్పరచుకుని, ఆయా దేశాలకు తమ సేవల్ని అందిస్తూ ఉన్నారు. అమెరికా దేశంలో అయితే భారతీయ మేధావులు మరీ భారీ సంఖ్యలో ఉన్నారు. ఈనాడు 'అమెరికా' అగ్రదేశంగా రూపొందిందంటే, అది అమెరికన్ల స్వయంప్రతిభ ఏమాత్రం కాదు. అమెరికాలో అక్షరాస్యత 50 శాతం మాత్రమేనని తాజా అమెరికన్ సర్వేలో తేలిందట. వారి మేధావి శాతం కూడా చాలా తక్కువ. అక్కడి వైజ్ఞానిక మేధావుల్లో భారతీయులూ, చైనీయులూ, జపాన్‌వారూ హెచ్చుగా ఉన్నారనే విషయం ప్రపంచమంతటా తెలుసు. అలా వివిధ దేశాల మేధావులను చేరదీసి వాడుకోవడంలో ఉంది 'అమెరికా వారి తెలివి'. ఈ విషయం మనలో చాలా మందికి తెలీదు.

ఆధునిక సైన్సు విషయంలో అగ్రదేశాలకంటే మన దేశం కాస్త వెనుకబడి ఉండడానికి ఒక ప్రముఖ కారణం ''మన మేధావుల విదేశీవలస''. వలసపోయే మేధావుల శాతం భారతదేశంలో ఎక్కువని ఇటీవలి సర్వేలో తేలింది. మేధావులకు విలువనిచ్చి ఆదరించే పరిస్థితులు మనదేశంలో అంతకంతకూ తగ్గిపోతున్నాయి. ఇందుకు కారణాలు అనేకం.

(పురాణాల్లో సైన్సు గ్రంథంనుండి)

## జీవితసభ్యులు



**.S. S. హేమంత్,**
**Plot No - 40N - IInd ST.**
నాచారం రోడ్ HMT Nagar
హైద్రాబాద్ - 500 076.

**వార్త:** కల్వకుర్తి: లో 22-1-97 వి.హిం.ప.వారు విశ్వకల్యాణ దినోత్సవం జరిపారు. సర్వశ్రీ చంద్రమౌళి, లింగమూర్తి, పాండురంగారెడ్డి ప్రభృతులు పాల్గొన్నారు.

# పీరోజీ మహర్షి (1829-1889)

(గత సంచిక తరువాయి) - ఆచార్య : బి. రామరాజు

పల్నాడు తాలూకా కుంకలగుంటవాసి కుంకలగుంట లాల్ ముస్లిముల్లో దూదేకుల శాఖకు చెందినవాడు. ఆయన గొప్ప నాదస్వరవిద్వాంసుడు; సంగీతం, డోలు, ఫ్లూటు, అల్గోజుల్లోను నిపుణుడు. నాటి సన్నాయి విద్వాంసుల్లో ఆయనకు సాటి మరొకరు లేరు. ఏడాదికి తొమ్మిది నెలలు స్వగ్రామం బయటే దూరదూర ప్రాంతాల్లో కచేరీలు చేసి పేరు కీర్తులతోపాటు ధనం కూడ పుష్కలంగా సంపాదించినాడు. ఒకటి రెండుసార్లు పీరోజీని దర్శించినాడు. ఆయనలో క్రమంగా ఆధ్యాత్మిక చింతన పెరిగింది. త్రిపురాంతకం, బ్రహ్మంగారి మఠం, బనగాని పల్లెవంటి ఆధ్యాత్మిక కేంద్రాల్లో ఆరాధనోత్సవాలపుడు కచేరీలు చేసినాడు. గొప్ప బ్రహ్మవేత్త సద్గురువు దొరికితే ఉపదేశం పొందవలెనని తహతహపడ్డాడు. హుమ్నాబాదు మాణిక్య ప్రభువు (1817-1865) సన్నిధిలో సన్నాయి వాయించి ఆమహాప్రభువుచే సత్కృతుడైనాడు. మాణిక్య ప్రభువులిచ్చిన వెండిరూపాయల పళ్ళెంలో తనజేబునుండి కొన్ని వెండిరూకలు పోసి ఆయన పాదాల వద్ద పెట్టి ప్రదక్షిణించి తనను శిష్యునిగా స్వీకరించి మోక్షమార్గం చూపుమని ప్రార్థించినాడు. మాణిక్యప్రభువులు సంతోషించి తారకమంత్రముపదేశించి సత్తెనపల్లిలో ఉండే పులహరి పీరోజీమహర్షి వద్ద పరిపూర్ణాచల బ్రహ్మోపదేశం పొందవలసిందని ఆదేశించినారు. లాల్ సాయెబు తిరిగి వచ్చి పీరోజీ మహర్షిని ఆశ్రయించి మాణిక్య ప్రభువుల ఆదేశం వినిపించి మహర్షి శుశ్రూషలో చేరి పోయినాడు. మహర్షి సాయెబును చాలాకాలం పరీక్షించి ఏండ్లు పూండ్లు జరిపినారు. ఒక వేసవి కాలం వీరాబాయమ్మ పీరోజీ గారు కారెంపూడి వద్దనున్న ఓబులేసు పల్లెలో ఉన్న తమ కూతురును చూడబోయి తిరిగి వస్తూ అడవిలో ఒక చెరువువద్ద డస్సిపోయి ఉన్నపుడు, లాల్ సాయెబు తనమేళంతో చేజెర్లనుండి తిరిగి వస్తూ ఆచెరువు వద్దనే గురుదంపతులను దర్శించి గొప్ప సేవ చేసినాడు. గురువు ప్రసన్నుడై అక్కడే అచలబ్రహ్మానందసంధాన రూపమైన మోక్షోపదేశం చేసినారు. లాల్సాయెబు స్వామి శిష్యుల్లో ప్రముఖుడై, ఎంతటి నాదస్వరవిద్వాంసుడో అంతటి వేదాంతి అనిపించుకున్నాడు; ఎందరికో ఉపదేశమిచ్చినాడు. గురువుగారు సమాధి చెందిననాడు (9-7-1889) స్వప్నసాక్షాత్కారం పొంది సత్తెనపల్లికి మేళంతో పరుగెత్తుక వచ్చి గురుసమాధి సమయంలో గురుకీర్తనలు పాడి భక్తులందరికీ ఒక కంట ఖేదాశ్రువులు మరొక కంటమోదాశ్రువులు వర్షింపజేసినాడు. గురువుగారు తనువు చాలించిన తిథినాడే శా.శ. 1819 హేవలంబి ఆషాఢశుద్ధ ఏకాదశి శనివారం 10-7-1897 తన 60వయేట దేహం చాలించినాడు. తానెక్కడున్నా గురువుగారి ఆరాధననాడు సత్తెనపల్లికి వచ్చి తనవంతు భక్తిగాన సేవ చేసేవాడు. తనువు చాలించేముందు తనవారసులకు పీరోజీ ఆరాధనోత్సవ సేవా కార్యభారం అప్పగించిపోయినాడు.

పీరోజీగారు సరిగా 60సంవత్సరాలు బ్రతికినారు. వీరిసంతానం 1. లక్ష్మోజీరావు 2.గోవిందరావు 3. లక్ష్మిబాయి 4.వీరాబాయి 5.పెదగోవిందబాయి 6. చినగోవింద బాయి. కొడుకు లిద్దరూ తండ్రిగారివద్దనే ఉపదేశం పొంది సన్మార్గవర్తనులై సంసారం దిద్దుతుంటే, పీరోజీ మహర్షి శిష్యసంచారం చేస్తూ అర్హులకు కారణదీక్ష ఇస్తుండేవారు. ఆయన వయస్సులో ఉన్నప్పుడు పొలం వద్ద ఇంటి వద్ద కాయకష్టం చేసేవారు, మధ్యాహ్నం కాసంత విశ్రమించి గ్రంథరచనం చేసేవారు. వారు ఆశువుగా అప్పటికప్పుడు కీర్తనలు పద్యాలు ధారాళంగా వ్రాసేవారు. ఆయన త్రికరణశుద్ధిగల గొప్పగురువులు. ఆయన ప్రవర్తన అందరికీ ఆదర్శం. 1. తలవంచుకొని

నడవటం 2. మితభాషిత్వం 3. వచ్చిపోయేవారినిచూడకుండటం 4. మౌనవ్రతం తు.చ. తప్పకుండ పాటించేవారు. వారి మౌనవ్రతాన్ని మితభాషిత్వాన్ని అపార్థం చేసుకున్న పండితులు ఆయన గర్విష్ఠి అని జమీందారుకు చాడీలు చెప్పినారు. జమీందారు ఏర్పాటు చేసిన సభలో పీరోజీ వారి భ్రమలు దూరం చేసినారు. పండితులు పామరులు ఎవరేమి ప్రశ్నించినా సాదరంగా సమాధానం చెప్పేవారు. శ్రీమంతులైన శిష్యులనుండి కూడ వారు ద్రవ్యం తీసుకోలేదు. 55 ఏండ్లవయసు వచ్చేదాక వారు అనారోగ్యం ఎరుగరు. 56వ యేడు నుండి అస్వస్థత కారణంగా ఎడ్లబండి పై శిష్యసంచారం చేసినారు. ఉదయం వరిఅన్నం, రాత్రి గోధుమ రొట్టె వారి ఆహారము. చివరి దినాల్లో నిరంతరం రచనావ్యాసంగంలో ఉండేవారు. శిష్యులడిగితే కాలం ముగియవచ్చిందనీ గ్రంథం పూర్తిచేయవలెననీ అన్నారు. ఉన్నట్లుండి ఒకసాయంకాలం భార్యా పుత్రులనూ ముఖ్య శిష్యులనూ పిలిపించుకున్నారు. తూర్పు ఇంటిలో పూర్వాభిముఖంగా పద్మాసనస్థులై పెద్దకొడుకు లక్ష్మోజీరావుకు హితోపదేశం చేసి, గురుపీఠం నెలకొల్పవలసిందిగా ఆదేశించి యోగనిష్ఠులై శా.శ. 1811 విరోధి ఆషాఢ శుద్ధ ఏకాదశి మంగళవారం రాత్రి లింగోద్భవ కాలాన (9-7-1889) హరహరహర అని మూడు సార్లుచ్చరించి ''శివార్పణం'' అంటూ బ్రహ్మరంధ్రం గుండా ప్రాణాలు విడిచి పరబ్రహ్మలీనులైనారు. తెల్లవారే వరకు చుట్టుపట్టుగ్రామాల భక్తులు శిష్యులు చేరినారు. సంచారార్థం వచ్చిన శతావధాని భానూరి లక్ష్మీనారాయణ మహర్షి అంత్యక్రియల్లో పాల్గొన్నాడు. ఆనాడు విధివిధానోక్తంగా కొడుకులు శిష్యులు పీరోజీ మహర్షిని వారితోటలోనే సమాధి చేసినారు. పీరోజీ మహర్షి అవతారం చాలించేసూచన కుంకలగుంట లాల్‌సాయెబుకు వలె మరికొందరికి లభించింది. రేగులగడ్డ వాస్తవ్యుడు పిచ్చయ్య అనే రజకుడు ఇంటిలోని పోరు పడలేక అడవుల పాలై గుత్తికొండబిలంలో మహర్షులను దర్శించినాడు. వారు ఐదుగురు; అక్కడున్న ఆరవ పీఠం ఎవరిదని అమాయికంగా పిచ్చయ్య అడిగితే సత్తెనపల్లి పీరోజీగారి దన్నారు; మహర్షిగారు బిలానికి చేరే తేది చెప్పినారు. పిచ్చయ్య వెదుక్కుంటూ మహర్షి సమాధి చెందిననాడే సత్తెనపల్లి చేరి వారి భౌతికకాయాన్ని దర్శించినాడు. పిచ్చయ్య సత్తెనపల్లికి దారి వెదుక్కుంటూ త్రోవలో వేమవరం గ్రామంలో తన అనుభవం వినిపిస్తే అది విన్న శానంపూడి పాపిరెడ్డి ప్రభృతులు, సత్తెనపల్లి శిరసాల పీరయ్యకూడ సమయానికి సత్తెనపల్లి చేరి మహర్షి అంతిమయాత్రలో పాల్గొన్నారు. పీరోజీ మహర్షిది సుందరరూపము, విశాలఫాలంపై మూసిన మూడవకన్నువంటి పెద్దకుంకుమ బొట్టు, నిమ్మకాయలు నిలబెట్టగల మీసాలు, తలపాగా, ఆజాను బాహువులు, తేజోమండలపరివేషంతో ఉన్న వారి బొమ్మ బహుశః 45-50 సంవత్సరాల వయస్సు అప్పటి దైయుంటుంది.

పీరోజీమహర్షి జ్యేష్ఠపుత్రులు లక్ష్మోజీ తండ్రిగారి ఆదేశానుసారం 1901 మఠం నిర్మించి పీఠమెక్కినారు. వారి తరువాత వారి జ్యేష్ఠపుత్రులు పీరోజీబాబు (1907-1975)గారు మఠాధిపతులైనారు. పీరోజీ బాబుగారి జ్యేష్ఠపుత్రులు పులహరి లక్ష్మోజీ బాబుగారు ప్రస్తుతం మఠాధిపతులు. పీరోజీమహర్షికి వనమా సుబ్బారాయుడు, పాటిబండ్లవీరయ్య ముఖ్యశిష్యులు. ఆయిరువురి చలువ వలననే మఠమందిరాల నిర్మాణం జరిగింది. వనమా సుబ్బారాయుడు ఏటుకూరి సీతారామయ్య చేత గురువుచరిత్రం 1928లో వ్రాయించి ప్రకటించినాడు. దానితో పాటు పీరోజీకృతులను 1945లో మహావాది వెంకటరత్నం చేత పరిష్కరింపజేసి ప్రకటించినాడు. మరల ఇన్నాళ్ళకు ''శ్రీపీరోజీ ఋషీంద్రులు -జీవితము కృతులు'' 1994లో అచ్చైనది. ప్రస్తుత పీఠాధిపతులు లక్ష్మోజీబాబు, మహర్షుల శతవార్షిక బ్రహ్మోత్సవాలు 1989లో వైభవంగా జరిపి ప్రత్యేక సంచికను ప్రకటించినారు. మహర్షి శిష్యుల్లో పాటిబండ్ల వీరయ్య బ్రహ్మనిష్ఠులు. ఆయన స్వరశాస్త్రం ఛాయాపురుషలక్షణం

తెలిసినయోగి. 60 సంవత్సరాల వయస్సులో (1922) ఆయన బ్రహ్మలీను లైనారు. ఆయన ఆంధ్ర యోగుల చరిత్ర కెక్కదగిన మహనీయులు. వారి చరిత్రం వేరొక చోట చెప్పుకుందాము. ఆయాపీఠాధిపతులతో పాటు ఈ యిరువురి శిష్యుల సమాధులుకూడ మందిరావరణంలోనే ఉన్నవి. వీటిని 29-9-1996నాడు దర్శించే భాగ్యం నాకు కలిగింది. పూర్వం పీరోజీ మహర్షి ఆరాధనోత్సవం ఆషాఢశుద్ధ ఏకాదశినాడు జరిగేది. అది మంచి వర్షాకాలం కనుక ఆనాడు లఘుపూజ చేసి పెద్దయెత్తున ఆరాధనోత్సవాలు మాఘశుద్ధ ఏకాదశినాడు చేస్తున్నారు.

పీరోజీమహర్షి తెలుగు సంస్కృతాల్లో అవసరమైన పాండిత్యం బాల్యంలోనే గడించి 12వ ఏటినుండి రచనావ్యాసంగానికి ఉపక్రమించినారు. కవితాభ్యాసం ఎవరివద్ద చేయకపోయినా మహర్షిగారు సంస్కృతాంధ్రాల్లో ధారాళమైన కవిత్వం చెప్పినారు. వారు రచించిన పెక్కుకృతులచ్చైనవి. మరికొన్ని అముద్రితంగా మిగిలిపోయినవి. వారి రచనల్లో 1. శ్రీరామ శతకం, బాల్యరచనం కందపద్యశతకం. 2. శేషగురు శతకం, కూడ కందపద్యశతకమే; తమకు పరిపూర్ణబోధ చేసిన జమిలి శేషార్యులను సంబోధిస్తూ వేదాంత తత్త్వమును ప్రపంచించిన పద్యావిలి. 3. నమశ్శివాయ గేయము, నారాయణ శతకాన్ని పోలిన 152 చరణాలగేయం, ప్రతిచరణం 'నమశ్శివాయ'తో అంతమౌతుంది. 4. పరమానంద సుధాలహరి, 34 కీర్తనల సంపుటి, ఈ కీర్తనలెక్కువగా ఆశురచనలు ముముక్షు జనులకుపయోగించేరచనలు. 5. పంచీకరణం వచనకృతి, యోగ వివరాలు తెలిపే రచన. 6. స్వప్రకాశము, జమిలి శేషయ్య గురువులు చిట్టెం శెట్టి లక్ష్మణార్యుల కంకితమైన ఈ వేదాంతకృతి భాగవతుల కృష్ణుని శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులను అనుసరిస్తూ అచల తత్త్వాన్ని 128 సీస పద్యాల్లో విపులీకరిస్తుంది. ఇది పీరోజీ గారి ప్రౌఢకృతి. 8. ఆచార్య శతకము, ఫీరోజీ మహర్షి శ్రీరామచంద్రుని గురువుగా సంభావించి వేదాంతం ప్రతిపాదించిన గొప్పకృతి. ఇది వారి చివరి కృతి కావచ్చు. 9. తత్త్వసంగ్రహము. వివిధవృత్తాలు, వృత్తార్ధాలు, ద్విపదలు, ద్విపదార్ధాలు, కీర్తనలున్న తత్త్వగ్రంధమిది. దీనిప్రారంభంలో జమిలి శేషార్యుల వంశవృక్షమున్నది. 10. పన్నగాచలనాయక శతకము, పీరోజీ ప్రౌఢవయః పరిపాకంలో రచించిన మత్తకోకిలావృత్తాలు. 11. గజేంద్రమోక్షము. 12. సాత్రాజితీయము 13. ప్రహ్లాద చరిత్రలు పోతన భాగవతాన్ని అనుసరించిన కృతులు. సాత్రాజితీయం యక్షగానం, మిగతా రెండు కీర్తనలు. ఇంకా 14. షట్కాండ రామాయణం గుమ్మెట కథ 15. దారుకావన విహారము- రగడ 16. దశావతారములు - పది అవతారాల కథలు దండకాల్లో - అందులో వామనావతారకథ భాగవతానుసారి విపులంగా 17. శ్రీరామ దండకము, ప్రత్యేకంగా 18. భద్రాద్రి మజిలీలు-కందార్ధాలు 19. మార్కండేయ విలాసము 20. శ్రీరామచంద్రార్యశతకము 21. ఏకవింశత్యవతారస్తోత్రము 22.శివలీలా మహత్తు ప్రభృతి కృతులు పుంఖానుపుంఖంగా పీరోజీ ఋషీంద్రులు రచించినారు. ఇందులో కొన్ని అముద్రితాలు. ఈ కృతులు ఋషీంద్రులు సంస్కృతం తెలుగు రెండు భాషల్లో అనర్గళంగా వ్రాయగలవారని చాటుతాయి. వీటి మూలంగా ఆయన భాషకంటె భావానికే అధికప్రాధాన్యం ఇచ్చినారనీ క్లిష్టమైన వేదాంతాన్ని సరళసుందరంగా ప్రపంచించినారనీ గుర్తించవచ్చు. వేమన వీరబ్రహ్మంగారలవలె కులమతాలకతీతంగా మానవత్వం ప్రధానంగా భక్తి అంతస్సూత్రంగా వేదాంతాన్ని ప్రబోధించిన పీరోజీఋషీంద్రులు ఆంధ్రులకు ఆరాధ్యులు.

1.ఆధారాలు:-పీరోజీఋషీంద్రులు-జీవితము, కృతులు 1994- ఏటుకూరి సీతారామయ్య - పరిష్కరణ మహోపాది వెంకటరత్నం - పీరోజీ ఋషీంద్రులమఠం, సత్తెనపల్లి - 522 403.

2. ఆంధ్రమహా భక్త విజయము - పంగులూరి వీరరాఘవుడు. అప్పికట్ల - 1957

3. పీరోజీ బ్రహ్మోత్సవ సంచిక - పీరోజీ మఠం, సత్తెనపల్లి - 1989.

4. పులహరి లక్ష్మోజీ బాబుగారితో ముఖాముఖి 29-9-1996.

# పంచకము

| | | |
|---|---|---|
| పంచాక్షరి | - | న, మః, శి, వా, య |
| పంచగంగలు | - | కావేరి, తుంగభద్ర, కృష్ణ, గోదావరి, గంగ |
| పంచభూతములు | - | పృధివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము. |
| పంచామృతములు | - | ఉదకము, పాలు, పెరుగు, నేయి, తేనె |
| పంచప్రాణములు | - | ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము. |
| పంచకన్యలు | - | అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరి. |
| పంచాంగములు | - | తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము. |
| పంచకావ్యములు (సంస్కృతం) | - | రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, కిరాతార్జునీయము, శిశుపాలవధ |
| పంచకావ్యములు (తెలుగు) | - | మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవపాండవీయం, పాండురంగమహాత్యం, శృంగారనైషధం. |
| పంచజ్ఞానేంద్రియములు | - | కన్ను, చెవి, నాలుక, ముక్కు, చర్మము. |
| పంచ కర్మేంద్రియములు | - | వాక్కు, పాదములు, హస్తములు, పాయువు, ఉపస్థ. |
| పంచ పల్లవములు | - | రావి, మర్రి, జువ్వి, మేడి, మామిడి |
| పంచ లోహములు | - | బంగారము, వెండి, ఇత్తడి, కంచు, ఇనుము |
| పంచ వర్ణములు | - | తెలుపు, నలుపు, ఎరుపు, పసుపు, ఆకుపచ్చ. |
| పంచ గవ్యములు | - | గోమూత్రము, గోమయము, గోఘృతము, గోదధి, గోక్షీరము. |
| పంచాయుధములు | - | సుదర్శనము, పాంచజన్యము, నందకము, కమోదకి, శార్ఙము. |
| పంచబాణములు | - | అరవిందు, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం. |
| పంచ భక్ష్యములు | - | భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము. |
| పంచ సంధులు | - | ముఖము, ప్రతిముఖము, గర్భము, అవిమర్శ, ఉపసంహారము. |
| పంచ యజ్ఞములు | - | దేవ, పితృ, భూత, బ్రహ్మ, మనుష్యయజ్ఞములు. |
| మాతృ పంచకము | - | కన్నతల్లి, భార్యను కన్నతల్లి, అన్న భార్య, గురుపత్ని, రాజు భార్య. |
| ముఖ పంచకము | - | సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము |

-సేకరణ. టి. యాదగిరి రావు

---

# యక్ష ప్రశ్నలు

1. ద్వితీయుడెవరు? – ధైర్యం కలవాడు.
2. నిద్రిస్తున్నపుడు కూడకన్ను మూతపడనిదేది? – చేప.
3. ఎప్పుడూ పండేది ఏది? – 'త్రయీధర్మం'.
4. సేవకులకు దానం ఎందుకు? – వారిని పోషించడానికి.
5. ఈజగత్తు నంతటిని వ్యాపించియున్నదేది? – అజ్ఞానము.
6. మానవుడు తన స్నేహితులను ఎందువల్ల పోగొట్టుకుంటాడు? – లోభంవల్ల.
7. దిక్కు (ఆధారం) ఏమిటి? – సత్పురుషులే.
8. దమము అంటే ఏమిటి? – ఇంద్రియములను నిగ్రహించడం.
9. శమము అంటే ఏమిటి? – చిత్తవృత్తులు అదుపులో ఉంచడం.
10. సాధుగుణం అంటే ఏది? – సర్వభూత హితం కోరడం.

– సేకరణ శ్రీయమ్. రంగారావు

శివుడనగా మంగళస్వరూపుడు. ప్రకృతిని తనలో లీనం చేసుకోగలిగినవాడు. ఆయన విభూతే ధరిస్తాడట. పాములే ఆభరణములట. శ్మశానమే ఇల్లట. బిచ్చ మెత్తకోవటమే ఆయన వృత్తట. ఒక ఎద్దు ఆయన వాహనమట. అడిగినవాడికి అన్ని కోరికలూ తీరుస్తాడట. విచిత్రంగాలేదూ వినటానికి. ఇంకా చిత్రమేమిటంటే శివుడిని పతిగా పొందటంకోసం పర్వతరాజపుత్రి పార్వతి అన్నీ విడిచి తపస్సు చేసిందట. చివరకు అతడిని భర్తగా పొందటమే కాదు అతని శరీరంలో సగమైందట.

ఆమె శక్తిస్వరూపిణి. ఎవరికయినా శక్తిసహాయము లేనిదే శివుని చేరుకోవటం సాధ్యంకాదు కదా! తండ్రివద్దకు చేరాలంటే తల్లి చేయి పట్టుకొని నడిపించవలసిందే. సృష్టిలో వీరు ఆదిదంపతులు. దీనినే సాధకుని శిరస్సునందలి ఇంద్రగ్రంథియందు శక్తి శివునియందు సంగమించియుండును. ఇది యోగికి, ప్రకృతి పురుషులకు సంగమ స్థానమనబడు ''సహస్రదళ పద్మము'' అని చెప్పియున్నారు.

శివమనగా మంగళకరము. శివకరమనగా శాశ్వతానందము. శివపంచాక్షరి కిదియే మూలము. పరమేశ్వరుడు పార్వతితో గూడి తన ఆశీస్సులను మనపై వర్షించుగాక! (సాయిబాబా పత్రిక నుండి) (ఫిబ్రవరి - 7- శివరాత్రి సందర్భంలో)

# యూరప్‌లో విశ్వహిందూ పరిషత్

పరిషత్ కార్యక్రమ నిర్వాహణ సౌలభ్యం కోసమై మొత్తం ప్రపంచాన్ని ఐదు ఖండాలుగా విభజించినారు. 1. అమెరికా క్యారెబియను ఉపఖండం 2. ఆఫ్రికా 3. యూరప్ 4. ఆసియా మరియు 5. ఆస్ట్రేలియా.

యూరప్ భూభాగంలో 49 దేశములున్నవి. అందులో 12 దేశములందు పరిషత్ యొక్క విభాగములు సక్రమముగా పనిచేయుచున్నవి. ఇవికాక 16 దేశాలలో హిందూపరిషత్ వాటి వాటి హిందుసమాజాలతో లేక హిందూ సంఘటనలతో సంబంధములు కల్గివున్నవి.

శ్రీ అశోక్ సింఘాల్ గారు 1996లో వెస్టిండీస్, గుయానా, సురీనాం, అమెరికా, జర్మనీ, హాలెండు పర్యటన ప్రభావం వల్ల విశ్వహిందూ పరిషత్ యొక్క విస్తరణ జరిగింది.

శ్రీ ఆచార్య గిరిరాజ్ కిషోర్, మహామంత్రి 1996లో ఇంగ్లాడు, అమెరికా, కెనడా, హాలెండు, నార్వే, డెన్మార్కు, స్వీడన్, జర్మనీ, దేశాలలో విస్తృతంగా పర్యటించినందున పరిషత్ కార్యకలాపములు విస్తరించి జాగృతమైనవి. స్విడ్జర్లాండులో ఇట్టి కార్యక్రమ విస్తరణకు ఐక్యసమితి ఏర్పడింది.

ఇంగ్లాండులో 8 లక్షలమంది హాల్లెండులో 1 లక్షా 60 వేలమంది. స్పెయిన్‌లో 10 వేలమంది, పోర్చుగల్‌లో 8వేలు, నార్వేలో 6 వేలు స్వీడన్‌లో 8 వేలు, డెన్మార్కులో 5 వేలు. ఫిన్‌లాండ్, వేయిమంది, జర్మనిలో 40 వేలు, స్విట్జర్లాండులో 40 వేలు, ఆస్ట్రియాలో 2 వేలు మరియు మాస్కోలో 2 వేలమంది హిందువులు నివసిస్తున్నారు.

పరిషత్ యొక్క స్వంతభవనములు, ఇంగ్లాడు, జర్మని మరియు నార్వేలో కలవు.

ఈసంవత్సరము యూరప్ పరిషత్ కమిటీ ఏర్పాటు చేయబడినది.

## వెస్టిండీస్‌లో పరిషత్ :

వెస్టిండీస్‌లో 36 దేశములు కలవు. ఇందులో 14 దేశాలలో హిందువులు నివసిస్తున్నారు. నాలుగు దేశాలలో పరిషత్ విభాగములు పనిచేస్తున్నవి.

1996లో ట్రినిడాడ్ నందు ''త్రినాదేశ్వర్ మహాదేవ్'' స్థాపన మరియు ఒకనదికి 'గంగాధార' నామకరణం, వేరే రెండు నదుల సంగమమునకు ''కపిల ప్రయాగ'' అని పేరు ప్రకటించినారు. ఈకార్యక్రమ నిర్వాహణ సమయంలో శ్రీ అశోక్‌సింఘాల్ గారి ఉపస్థితి ఆనందకరమైన విషయం.

1997న హిందూ సాధనా సంవత్సరము నిర్వహింపబడును. అంతేకాక సంత్ తులసీదాస్ జీని క్యారెబియెన్ హిందుత్వమునకు పితృపాదులుగా స్వీకరించిరి. శ్రీస్వామి వివేకానందుల వారి 41 అడుగుల ఏకశిలా విగ్రహస్థాపన జరిగింది.

ఇక్కడ హోళీ, దీపావళి పండుగలుజాతీయ పండుగలు. ట్రినిడాడ్ యొక్క ప్రధాన మంత్రి శ్రీ వాసుదేవ్ పాండేగారు భారత రిపబ్లిక్ దినోత్సవ సందర్భమున 1997 జనవరి 26న భారతదేశము ప్రత్యేక అతిథిగా విచ్చేసిరి.

## దక్షిణ అమెరికాలో పరిషత్

ఈ భూభాగంలో 9 దేశాలున్నవి. సురినాం గుయానాలలో పరిషత్ విభాగములున్నవి సురినాంలో స్వంతభవనం కూడ ఉన్నది. పెరూ, బ్రెజిల్, ఫ్రెంచి గుయాన్‌లలో పరిషత్ విభాగములు పూర్తి ఏర్పాటుకు సంభాషణలు జరిగినవి. సురినాం మరియు ట్రినిడాడ్ దేశాలలో రామాయణము మరియు మహాభారత్ టి.వి. సీరియల్స్ ఒక సంవత్సరంపైగా రాష్ట్రీయ దూరదర్శన ద్వారా ప్రసారం అవుతూవున్నవి.

– అనువాదం – ప్రమోద్‌వళ్ సంగ్‌కర్.

# అజ్ఞానం ఎలా తొలుగుతుంది

ఒకటి+ ఒకటి = రెండు. ఇది నిజమా? కాదా? నిజం. ఇది తెలిసిన విషయమా కాదా? తెలిసిన విషయమే? కాబట్టి జ్ఞానం రూపంలోనే ఉంది.

తెలిసిన విషయమైతే, జ్ఞానం కొత్తగా పుట్టించలేదు. మరి ఏం జరిగింది? టీచరు సుప్రసిద్ధ విషయం యొక్క అజ్ఞానాన్ని మాత్రమే తొలగిస్తున్నాడు.

ఈజ్ఞానం (తెలిసినవిషయం) ఇంకొకరికి (తెలియని వానికి) తెలియబడితే అజ్ఞానం తొలగడం మాత్రమే జరిగింది. అతనికి ఇప్పటి వరకు 1+1=2 అన్న విషయం తెలియదు. అంటే ఆవిషయం యొక్క అజ్ఞానం ఉంది. బోధవల్ల ఈ అజ్ఞానం పోయింది. కాన ఇక అతను అజ్ఞానికాడు. కనుక అజ్ఞానం తొలగించటం మాత్రమే ఉంటుంది. సరియైన మానసికవికాసం లేనివాడో, పిచ్చి వాడో అయితే తప్ప ఎవ్వడైనా జ్ఞానానికి అర్హుడే. జ్ఞానే, అయితే ముందు టీచరు స్పష్టంగా తెలిసినవాడై ఉండాలి.

–స్వామి దయానంద బోధనలనుండి:

★ (18 ఫిబ్రవరి – స్వామి దయానంద జయన్తి)

# వర్తకుల్లారా లేవండి - దేశాన్ని రక్షించండి

(మీ జీవితం, ధనసంపద, దేశము ప్రమాదం ముంగిట వున్నవి- ఆనంద్ శంకర్ పాండ్యే)

2-9-95న శ్రీ శేషన్ గారు టైమ్స్ పత్రికలో ఒకవేళ భారత దేశంలో ప్రస్తుత పరిస్థితే కొనసాగితే రానున్న 10 సంవత్సరాలలో దేశం చిన్నాభిన్నం అయి ముక్కలు ముక్కలుగా విడిపోతుంది. సోవియట్ రష్యాలో జరిగిన దానికన్నా ఎక్కువగా నాశనం సంభవిస్తుంది'' అని చెప్పినారు. ఇట్టి తరుణంలో వ్యాపారరంగంలో వున్న వారి ధన, మాన, ప్రాణాలకు ముప్పు వాటిల్లక తప్పదు వారికికభవితవ్యం లేదు దేశానికే భవిష్యత్తు లేనప్పుడు ఇహ వారి సంగతి?

ఇది వాణిజ్యయుగం ఎప్పుడైనా ఏదేశానికైనా దాని బాగోగులు వాణిజ్యవేత్తల చేతులలో వుంటాయి. దానికి చక్కని నిదర్శన అమెరికాయే. స్వాతంత్ర్యం పూర్వము కూడ పూజ్య గాంధీజీకి దేశ స్వాతంత్ర్య సముపార్జనలో అన్నివిధాలుగా సహాయపడినది వ్యాపారస్థులే. ఈ రోజుకూడ మనకు మనదేశానికి అన్నివేపులా చేట్లు చేకూరుతున్న ఈ తరుణంలో స్వదేశ పరిరక్షణకు కంకణం కట్టవలసింది వ్యాపార రంగంలో వున్నవారే. మనజాతికి ఈ క్రింది చెప్పిన విధంగా ప్రమాదం పొంచివుంది.

1. కాశ్మీరులో టెర్రరిస్టుల ఆరాచకత్వాల వల్ల 3 లక్షల మంది దేశీయులు బికారులై చెల్లాచెదురై జమ్ము పరుగెత్తి పోయినారు. స్త్రీలను అవమాన పరిచి బాల, వృద్ధులను సంహరించి వారి ఆస్తులు లాగుకొన్నారు.

2. సెక్యులరిజం పేరుతో సుమారు కోటిన్నర మంది బంగ్లాదేశ్ నుండి మనదేశంలో చొరబడి ఏకు మేకు అయినారు. ఇంకా కొన్ని కోట్ల మంది మనదేశంలో చొరబడడానికి సిద్ధంగా వున్నారు. దుబాయి గుండాలు భారతీయ వ్యాపారస్తులను హత్యలు చేస్తున్నారు. అంతేకాక కోట్లాది రూపాయలు మత్తుమందులు దేశంలో గుప్పిస్తున్నారు. భయంకరంగా పెద్ద ఎత్తున గోవధలు చేస్తున్నారు, బలవంతంగా వేలాది భారతస్త్రీలను వేశ్యలుగా మారుస్తున్నారు. లోలోపలే హిందూ సమాజాన్ని కుళ్లే విధంగా అనేక దుశ్చర్యలు జరుగుతున్నవి. లంచగొండితనం వేళ్ళూనుకున్నది. రూపాయి విలువ కేవలం నాలుగు పైసలకు పడిపోయింది.

3. ప్రభుత్వ లెక్కల ప్రకారం హిందువులు 23% అభివృద్ధి చెందుతూవుంటే ముస్లింల సంఖ్య 33% పెరుగుతున్నది. కొన్ని దశాబ్దాల తరువాత ఈ పద్ధతివల్ల తమ దేశంలోనే హిందువులే అల్పసంఖ్యాకులుగా మారుతారు. ప్రఖ్యాత పత్రకారుడు అరుణ శౌరి ప్రకారం 'హిందుస్థాన్‌లోనే అనేక పాకిస్థాన్‌లు ఏర్పడగలవు' 'పాంచజన్యం- 6-7-95) అట్టి పరిస్థితులలో ఊచకోత క్రింద హిందువులను వధించడం కాశ్మీర్‌లో జరిగినట్టు జరుగ గలదు.

పైన తెలిపిన పరిస్థితులకన్నిటికి కారణం హిందుజాతిలో ఉన్న క్షమాగుణమే. సర్వధర్మ సమభావన అన్న విధానమే మనవారిని మనదేశంలోను విదేశాలల్లోను రెండవతరగతి పౌరులుగా జీవించే పరిస్థితి ఏర్పరుచుచున్నది.

ఇట్టి సంకట పరిస్థితులలో విశ్వహిందూ పరిషత్తు దేశ విదేశాలలో హిందువులను జాగృతం

చేయుటకు, ధర్మపరిరక్షణకు కృషిచేస్తున్నది. రామజన్మభూమి మందిర నిర్మాణం, గోరక్షణ, సామాజిక సారూప్యత విదేశాలలో హిందూ ధర్మ సమ్మేళనములు, సాహితీ సభలు గత 12 సంవత్సరాలుగా హిందూత్వ ప్రచారం కొనసాగిస్తున్నది.

విశ్వహిందూ పరిషత్ మరియు సంఘ్, దేశము మరియు హిందూ సామాజిక రక్షణ కోసం ధృఢ నిశ్చయం కలిగియున్నది.

1. విశ్వహిందూ పరిషత్ యొక్క 2500 యూనిట్లు సేవా కార్యక్రమాలకోసం 4కోట్లరూపాయలు ప్రతి సంవత్సరం అత్యంత ఉపయోగకరమైన వాటికోసం ఖర్చుచేస్తారు. అందులో 5లక్షలమంది ఆదివాసులు, దళితులు బాగుపడుటానికి వినియోగిస్తారు. కాని ధనాభావం వల్ల విహెచ్.పి అనేక కార్యక్రమాలు సంపూర్ణంగా కొనసాగక అనేకమంది హిందువులు క్రిష్టియన్లుగా మార్చబడుతున్నారు. ఇట్టి తరుణంలో మీ నివేదన ఈ మహత్కార్యానికి అంగీకరింపబడకుండా వుంటుందా?

2. 10సం॥ల క్రితం వ్యాపార వర్గాలవారు విహెచ్‌పికి కావలసిన ధనసహాయం చేయనిరాకరించినందున వుల్ఫా ఉగ్రవాదుల చేతుల్లో అనేక మంది హిందువులు హతమార్చబడిరి. ఎక్కడైతే విహెచ్‌పి కార్యక్రమాలు స్థంభించినవో అచట ధర్మ నిరపేక్షత జరుగుతూ వస్తూవున్నది.

3. ధర్మము దాని విలువలు నశిస్తున్నవి అనుటకు నిదర్శనంగా, సినిమాలు దూరదర్శనలోను అశ్లీల, అసభ్యతాపూర్వకమైన దృశ్యాలు చూపిస్తున్నారు. వాటి ప్రభావం వల్ల గుండాయిజం, దోపిడి, స్త్రీపరమైన దోపిడి, ఎయిడ్స్ వంటి జాడ్యాలు ప్రబలుతున్నాయి. ఇట్టి దురాగతాలను మొగ్గలోనే తుంచుటకు విహెచ్‌పి పాఠశాలలో దూరదర్శన్‌ద్వారా ధార్మిక సచ్చారిత్రిక అంశాలను ప్రసారం చేయాలని కోరుతున్నది.

4. ఒక్క విహెపి మాత్రమే హిందూ ధర్మ పరిరక్షణకొరకు, దేవాలయాలు, గురుద్వారాల రక్షణకొరకు, సంస్కృతీ సచ్చీలత కొరకు నిరంతరము కృషిచేస్తున్నది. దేశ సమగ్రత కోసం అఖండ భారతికోసం, బలవంతంగా ముస్లింలుగా మార్చబడిన హిందువులకోసం అన్ని విధాలుగా అనేక కష్టనష్టాలు ఎదుర్కొని కృషి సల్పుతున్న విహెచ్‌పికై మనం సహాయం చేయటం ఎంతైనా అవసరము, మనమంతా ధన, తను, ప్రాణములతో ఆ సంస్థ కృషికి చేతనైన తోడ్పాటు చేయకపోతే హిందూ సమాజము బలహీన పడుతుంది. ఎప్పుడు అది బలహీన పడ్తుందో అప్పటి వ్యాపార వర్గం కూడ అధోగతి పాలు అవుతుంది.

## వ్యాపారస్తుల ప్రత్యేక కృషి

1. ఋషులు, బ్రాహ్మణులు-ధనసంపాధన, వ్యాపారనిర్వహణ అంతా వైశ్యులకు అప్పచెప్పి వారు సామాన్య జీవనము గడిపిరి. 90%వ్యాపార కార్యకలాపాలు, సంపద, ధనం వైశ్యుల చేతిలో

ఉండిపోయింది. కాని వారు బీదహిందువులకోసం కనీస కర్తవ్యాన్ని నిర్వహించ మరిచి పోయినారు.

2. యూరప్, అమెరికా దేశాలలో సంపన్నులైన వ్యాపార వర్గాలవారు తమ సంపదనంత తమ మరణానంతరం దేశంలోని బీదజాతికి అంకితం చేస్తూ వారి అభివృద్ధికి తోడ్పడుతారు. భారతదేశంలో కూడ సంపన్న వ్యాపారస్తులు ఆ విధంగానే చేయవల్సివున్నది.

3. భారతదేశంలో కొంతమంది సహృదయులైన వాణిజ్యవేత్తలు హిందూసంస్థలకు బీదవారికి సహాయం చేస్తున్నారు. కాని కొంతమంది వ్యాపారస్తులు వివాహాలలో, పండుగలలో కోట్లకొలది రూపాయలు తమ గొప్పతనం చాటుకోవడానికి వృథాగా ఆడంబరంగా వెచ్చిస్తున్నారు. అలాచేయని ముస్లిములు, క్రిష్టియన్లు తమ తమ సంస్థలలో నిధుల కొరత ఎరుగరు. కాని హిందూ సమాజానికి చెందిన సంస్థలలో డబ్బు కానరాదు ఇది చాలా విచారించ దగ్గవిషయం. దయచేసి గుర్తుంచుకోండి కొంత సమయం తరువాత అవకాశం చేజేతులా జారిపోతుంది.

4. అందువల్ల వ్యాపార గణమంత తమ ఆదాయంలో 1% విశ్వహిందూపరిషత్ కార్యక్రమాలకు కేటాయించి ఆదరపూర్వకంగా వారిని కనీసం ఫోనుద్వారా పిల్చి ఇవ్వవచ్చును. మీరు పిలవక పోవడం వల్ల వారు మీ వద్దకు చేరలేక పోవచ్చు అందువల్ల మీరు వారిని నిరాశపర్చకూడదు. వెంటనే సమాయత్తం కాండి. ఫోను అందుకోండి పిలవండి మీ చేతనైన సహాయం అందించండి, జాతిని సంస్కృతిని రక్షించుటకు మీ వంతు కృషిని అందించండి. .

వ్యాపారస్థులందరికి ఇదే సరియైన, నిజమైన పూజ. ఎందువల్ల అంటే మీరు ఇచ్చే దానితోనే దేశంలోని అన్ని దేవాలయాలు, మందిరాలు, గురుద్వారాలు రక్షింపబడ్తాయి. హిందూ ధర్మం నిలుస్తుంది, అహింస, విశ్వశాంతి నిలదొక్కుకుంటుంది. మానవ మనుగడ సరియైన పద్ధతిలో కొనసాగుతుంది.

దయచేసి ఉత్తరాలద్వారా వివరములు సేకరించండి పైనవ్రాసిన దాన్ని శ్రద్ధతో చదవండి. సరియైన మార్గంలో పయనించండి.

శ్రీవిష్ణుహరి డాల్మియా (ఢిల్లీ) ఇ.నం.3013888
ప్రా.డాల్మియా సిమెంటు కం.లి. ఆఫీసు.331486
శ్రీఅశోక్ సింఘాల్‌గారు (ఢిల్లీ) 6187992
ఆచార్యగిరిరాజ కిషోర్‌గారు (ఢిల్లీ) 6103497
హరి ఆత్మారామజీ (ముంబాయి) ఇ.నెం.6499828

---

''తన తల్లిని గాఢంగా ప్రేమించే వ్యక్తి జీవితాంతం విజేత మనస్తత్వంతో వుంటాడు. ఆ మనస్తత్వమే అనేక సార్లు అతడి విజయానికి కారణమవుతుంది.''

– ఫ్రాయిడ్

సేకరణ – చేరెడ్డి శ్రీరామ్‌రెడి

# శ్రీరుద్రమ్

- డా॥యం.వి. ఆర్.శర్మగారు

ఓం నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః
నమస్తే అస్తు ధన్వనే బాహు భ్యాముతతేనమః ॥

మొట్టమొదటి యీ మంత్రమునకు, హేరుద్రా! నీ కోపమునకు నమస్కారము అని అర్థము. భగవంతుడు నిరస్త సమస్త దోషుడు. అఖిల దోషములకు అతీతుడు. నిఖిల కల్యాణగుణములకు నెలవు. ఈ విధమైన రుద్రునకు కోపమెలా వస్తుందీ? అనే అనుమానం కలుగవచ్చు. పరమేశ్వరుడు స్వయంగానూ, తన అవతారాల ద్వారానూ శిష్టులను అనుగ్రహిస్తాడు; దుష్టులను నిగ్రహిస్తాడు కూడాను. ''పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచదుష్కృతాం'' అని కదా శ్రీమద్భగవద్గీత శ్రీ కృష్ణ రూపంలో వక్కాణించింది. నరసింహావ తారంలో ప్రహ్లాదుణ్ణి రక్షించిన ఈశ్వరుడు హిరణ్య కశిపుణ్ణి చంపివేసినాడు కూడా. శిష్టరక్షణ యెంత ప్రముఖమైనదో, దుష్ట శిక్షణ కూడా అంతే విశిష్టమైనది. ఒక చెంపపై కొట్టితే మరొక చెంప చూపెట్టుట మొదలైన భీరుత్వలక్షణాలు కల ఈశ్వరుణ్ణి మనం ధ్యానించలేము. మన జాతిలో కూడా ఈ లక్షణాలను మనం పెంచి, పోషించలేదు. దుష్టులను నిగ్రహించు సమయంలో పోలీసులు కానీ, దేశరక్షణలో మిలిటరీ గానీ, నేరస్తులకు శిక్ష నిర్ధారించే సమయంలో జడ్జిగానీ, శిక్ష అమలు పరిచే సమయంలో జైలరు గానీ కరుణామయులుగా మారి, దయతో, జాలితో వ్యవహరించినట్లయితే నేరాలు పెరుగవా? కనుక తప్పుచేసిన వారిని క్షమించుట వల్ల అపరాధాలను ప్రోత్సహించినట్లే అవుతుంది. నేరాలను చేసేవాళ్లకు పట్టపగ్గాలుండవు. కనుక అపరాధుల విషయంలో కఠినంగా వ్యవహరించవలసిందే. అలా కఠినంగా వ్యవహరించేందుకు కోపం ఉపకరించవలసిందే. సమాజశ్రేయస్సు దృష్ట్యా యీ కోపం తప్పనిసరి. భగవంతుడు స్వయంగా ''శ్రుతి, స్మృతులు నా ఆజ్ఞలు. వాటిని వుల్లంఘించిన వాడు నన్ను ధిక్కరించి, వధార్హుడగుచున్నాడు'' అని నుడివినాడు- ''శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా యస్తా ముల్లం ఘ్యవర్తతే

**ఆజ్ఞాచ్ఛేదీ మమద్వేష్యః సమే వధ్యశ్చ జాయతే॥''**

అయితే ఈశ్వరునకు ఒకరిపై కోపం, మరొకరిపై ప్రేమ వుండవచ్చునా అనే సందేహం రావచ్చును. జీవులు అన్నీ కర్మలను వొకేరకంగా నిర్వహించుట లేదు. కాళ్ళూ, చేతులూ, కళ్ళూ, ముక్కూ అన్నీ సారూప్యంగానే వున్నా వొకడు యితరులకు సహాయ పడుతున్నాడు. మరొకడు యితరులను బాధిస్తున్నాడు. సహాయం చేసే కర్మా, బాధపెట్టే కర్మా వొకడి కొకడి భిన్నములు. ఆయా కర్మల కనుగుణంగా ఆయాఫలితాలను పరమేశ్వరుడు ప్రసాదిస్తున్నాడు. ఒక విధంగా చెప్పాలంటే జీవులు చేసేవి సత్కర్మలా, దుష్కర్మలా అనే విషయం వాళ్ల కర్మ ఫలాలను కూడా నిర్ణయిస్తున్నది. అంతేగానీ భగవంతునికి వైషమ్య-నైర్ఘృణ్యములు లేవు. పైగా యీ విధమైన కోపం భగవంతునికి సొంపుగానే వుంటుంది. వీరాంజనేయ రూపము ఎంతో మనోహరంగా, ఆ ణ వంతంగా వుంటుంది గదా!

ఉపనిషత్తులు ''భీషాస్మాద్వాతః పవతే....'' అనుచో విశ్వములోని గాలి, సూర్యుడు, అగ్ని మొదలగునవన్నియు తమ తమ విధులు అనగా గాలి వీచుట, సూర్యుడు ఉదయించుట, అగ్ని కాల్చుట అను పనులు భగవంతుని భయము వలననే సక్రమముగా నిర్వహిస్తున్న విషయాన్ని ఉద్ఘాటించినాయి.

కాళిదాసు రఘువంశ కావ్యంలో
భీమకాంతైర్నృపగుణైః స ఎభూవోపజీవినాం
అధృష్యశ్చాభిగమ్యశ్చ యాదో రత్నైరివార్ణవః॥

అనే శ్లోకంలో సముద్రంలో రత్నాలతో బాటు భయంకర జలచరాలు కూడా వున్నట్లే రాజుగారిలో కూడా ఆకర్షణీయమైన గుణముల తోడ్తోడుగా భీమ అంటే ''భయంకరమైన'' లక్షణాలు కూడా సహవాసం చేస్తున్నాయని రాజలక్షణాలను వాక్రుచ్చినాడు. ఒక రాజ్యాన్ని పాలించే రాజుకు భయాన్ని గొలిపే లక్షణాలు కూడా కొంత లేనిచో రాజసము, ఠీవీ లేని ఆ రాజును మనం ఊహలలోనే రాజుగా స్వీకరించలేమే! మనకంటికి ఆనుతున్న యీ విశాల విశ్వభాగానికీ, దృగ్గోచరం కాని సమస్త విశ్వానికీ శాసకుడైన పరమేశ్వరుడు ప్రళయాది కాలాలలో వుపయోగించుటకు కోపశక్తి కూడా ఆయనకు భూషణమే!

---

ఆర్యా

## • లేఖ - శ్రీ కృష్ణానంద మఠం స్వామి

దిల్‌సుఖ్‌నగర్

రెండు నెలలుగ ''విశ్వహిందూ'' శ్రీకృష్ణానంద మఠమునకు పంపుతున్నారు.

జనవరి నెల సంచికలోని Dr.M.V.R.శర్మగారి ''భాగవతము-శ్రీకృష్ణతత్త్వము'' అన్న శీర్షిక తత్త్వపరంగ బాగున్నది.

హిందూ ధర్మమునందు ప్రజలను మేల్కొలుపుటకు మీరు చేసే కృషి ఎంతైనా శ్లాఘించదగినది.

'ప్రభు' అంటె స్వయంప్రకాశమానమైన ఆత్మ అని అర్థం. ఈనాటి ప్రభుత్వం స్వయం ప్రకాశమానమైన 'ప్రభుత్వం' కాదు. 'ప్రభు'త్వమును ప్రదర్శించే సత్తా వీర్యం ఈనాటి పాలకులకు లేదు. పాలకులకు 'ప్రభు'త్వం విలువ తెలుపుట ఎలాగో అర్థంకావటం లేదు. ఎలుకలు పిల్లికి గంటకట్టాలని ప్రయత్నించినట్లుగ ఉన్నది.

డా॥కసిరెడ్డిగారి జైహింద్ వివరణను ఒక్కొక్క నాయకునికి మొదడులో నాటాలి ఏనాటికైనా నయానగానీ భయానగానీ నానావిధప్రయత్నాలతో జరుగవలసినది ఇదే. అప్పుడే హిందూధర్మం నిలిచి కలియుగం కృతయుగమవుతుంది.

## ✯ గమనిక : పరిప్రశ్న

ఈశ్వర, ఉగాది (ఏప్రిల్ 97) నుండి 'విశ్వహిందు' పత్రిక పాఠకుల ఆధ్యాత్మిక, ధార్మిక సందేహాలకు సమాధానాలు 'పరిపశ్న' అన్న శీర్షికతో ఇవ్వదలచింది. సమాధానాలు ప.పూ. శ్రీశ్రీశ్రీ స్వామిజీ, శ్రీకృష్ణా నందమఠం. దిల్‌సుఖ్‌నగర్ - హైద్రాబాదు వారు ఇవ్వడానికి దయతో అంగీకరించారు. పాఠకులు తమ పరిప్రశ్నలు కార్డుపై క్లుప్తంగా వ్రాసి 'విశ్వహిందు' 4-5-212, కోఠి, హైద్రాబాదు - 095కు ప్రతిమాసం 15వ తేదిలోపే పంపవలయును. -సం

# విదేశీ వార్తలు

ఆసియా ఖండంలోని హిందూ, బౌద్ధ, షింటో మతాల మహాసమావేశం 1996 నవంబర్ 5,6 తేదీలలో 'క్యోటో' (జపాన్) లోని 'ఠ్యాకోకు' యూనివర్సిటీలో హిందూ, బౌద్ధ, షింటో మతాల మతాధిపతులు, పీఠాధిపతులు, సాధు, సంత్‌లు, ధర్మాచార్యులు, మహామేధావులు, ధార్మిక నాయకులు సమావేశమైనారు.

''అహింసయే భవిష్యత్ ప్రపంచమార్గం'' ప్రధాన ఆశయంగా వారు చర్చించారు. జగద్గురు శంకరాచార్యుల వారి ఆశీస్సులతోసభప్రారంభమైంది. ప్రపంచమంతా ' ఉపనిషద్ విజ్ఞానము', 'బౌద్ధమతాచరణ', 'ప్రకృతిని ప్రేమించు' అనే షింటో సిద్ధాంతాలలో నిండియున్నది. అని జగద్గురు వివరించారు.

పూజ్యులు శ్రీ వెన్.షిజుమరొనొకయామ, డా.భూషణ కె.మోడి, డా.కరణ్‌సింగ్ ప్రభృతులు ఆ చారిత్రక సమావేశంలో పాల్గొన్నారు.

**★'విశ్వహిందూ పరిషత్ యూరోప్ జోనల్ కమిటీ'. ఏర్పాటు.**

కార్యాధ్యక్షులు: శ్రీ రమేష్ జైన్ - ఫ్రాంక్‌ఫర్ట్ - జర్మనీ.

కార్యదర్శి: శ్రీ కిషోర్ రూపరేలియ - లండన్ - U.K

జోనల్ సమన్వయ కార్యదర్శి: శ్రీ బ్రహ్మదేవ్ ఉపాధ్యాయ - డెన్హాగ్-హాలెండ్ ఈ కమిటీ ఇతర సభ్యులు - మరియు ఇతరేతరదేశాల జోనల్ కమిటీలు త్వరలో నియామకమౌతాయని వి.హిం.ప. సంయుక్త ప్రధానకార్యదర్శి శ్రీ బాలకృష్ణ U.నాయక్ తెలియజేశారు.

**★మలేషియా** హిందూ సంఘ అధ్యక్షులుగా శ్రీ ఎ. వైద్యలింగంగారు ఎన్నుకోబడ్డారు. గత అనేక దశాబ్దాలుగా హిందూ సమాజసేవలో నిమగ్నమైయున్నదీ మలేషియా హిందూ సంఘం.

**★ సౌదీ అరేబియా హిందూ బహిష్కరణ!**

సౌదీ అరేబియా ముస్లింరాజ్యంలో హిందువులు ఉద్యోగాలకనర్హులుగా భావించి 'వీసా' నిరాకరణ జరిగింది. 'ముస్లింలు, క్రైస్తవులు మాత్రమే దరఖాస్తు కర్హులని ప్రత్యేక ప్రకటనలు గత అనేక సంవత్సరాలుగా వెలువడుతున్నవి.

భారత గవర్నమెంటు ఇప్పటివరకూ ఏ విధమైన 'సెక్యులర్' చర్యతీసుకోలేదు.

**★ 'U.S.A. మేరీల్యాండ్ అసెంబ్లీలో హిందూ ప్రార్థన.'**

ఈ సంవత్సరం నుండి మేరీల్యాండ్ అసెంబ్లీ సమావేశాల ప్రారంభంలో హిందూ ప్రార్థన ప్రవేశపెట్టారు. క్రితం వరకూ క్రైస్తవ, జ్యూ ప్రార్థనలే జరిగేవి.

ఇపుడు హిందూ-జైన్ దేవాలయ (బాల్టిమోర్) పూజారి శ్రీయస్.రామకృష్ణన్‌గారు హిందూ ప్రార్థనలు చేయిస్తున్నారు.

మేరీల్యాండ్ నూతన గవర్నర్ శ్రీ పారిస్ గ్లా డింగ్ గారి కోరిక మేరకీ న్యాయం జరిగింది.

**★ క్రైస్తవశాస్త్ర వేత్తలు హిందువులుగా:**

క్రైస్తవంతో విసుగెత్తిన, నిరాశ చెందిన యువశాస్త్రవేత్త, పరిశోధకుడు ( సాలిడ్ స్టేట్ ఫిజిక్స్) శ్రీ పి.పాల్ ఎడ్విన్‌గారు గత నెలలో ఆర్యసమాజ మందిరం, న్యూఢిల్లీలో హిందుత్వాన్ని స్వీకరించారు. బ్రిటీష్ పాలనలో తన తాతలు విధిలేని పరిస్థితులలో క్రైస్తవులుకాగా ఇపుడు తాను తిరిగి హిందూకావడం సంతోషంగా ఉందని 'శ్రీపాల్ ఎడ్విన్' అన్నారు.

డా॥అనిబిసెంట్ ఉవాచ.

''40 సంవత్సరాలకుపైగా ప్రపంచ మహామతాల అధ్యయనానంతరం 'హిందుత్వ' మంత ఆధ్యాత్మికత (Spiritual), సమగ్రత (Perfect) గల మతం మరొక దానిని నేను కనుగొన లేకపోయాను''.

కబుర్లు | # హిందూత్వంపట్ల దేశదేశాల్లో అభిమానం

ఇక్కడహిందూదేశంలో జీవిస్తూగూడా, తాము హిందూవులం అని చెప్పుకొనడానికి ''మనవాళ్లు'' కొందరు సిగ్గుపడుతుంటే- ఎక్కడో దూరదూరదేశాలలో స్వీయధర్మసంస్కృతుల వసతులుసైతం లేనిచోట్ల నివసిస్తూ కూడా, తమ వారసత్వాన్ని, పరంపరను, సాంస్కృతిక మూల్యాలను అన్వేషించి, తెలుసుకొని, ఆప్రకారం జీవించాలని ఆయా దేశాల హిందువుల తహతహ లాడడం విశేషం కదూ!

''మనవాళ్ల''లో ప్రముఖుడనదగు జవహర్లాల్‌నెహ్రూ తనను గురించి '' ఐ యామ్ ఏ హిందూ బై యాక్సిడెంట్ ఆఫ్ బర్త్'' అని చెప్పుతుంటే, అదంతా ''పరదేశీయుల క్రింద బానిసత్వపు ప్రభావంలే'' అని అప్పట్లో సంబాళించుకున్నాం. పరదేశీయులు వదలి వెళ్లి ఐదు దశాబ్దాలయినా గూడా, అలాంటి ధోరణులు వదలి పోకపోగా, మరింత ఎక్కువగావడాన్ని ఏమనుకోవాలి?

ఈమధ్య ట్రినిడాడ్ దేశంప్రధాని శ్రీవాసుదేవపాండే తనసతీమణి శ్రీమతి ఉమతో కల్సి భారతరి పబ్లిక్ దినోత్సవాలకు ప్రత్యేక అతిథిగా వచ్చారు. ఆయునకు సంబంధించిన పత్రాలలో ఆయుననుహిందువుగా అభివర్ణించారట. దీనిని గురించి ప్రస్తావిస్తూ ఒక భారతీయపత్రికాప్రబుద్ధుడు '' ఇప్పటికీ హిందువునని చెప్పుకునే ప్రధాని'' అంటూ విద్దూరపడ్డాడు. మరొక పత్రికాప్రబుద్ధుడికి ఆయన సంస్కృతీ వారసత్వాల కన్న ఆయన ''కులం'' ముఖ్యమై పోయింది గాబోలు-''ప్రపంచంలో ఏకైక బ్రాహ్మణ ప్రధాని'' అని వ్రాశాడు! ఈ విచిత్ర ప్రవృత్తికి చురకవడ్డిస్తూనో ఏమో, శ్రీపాండే ఒక సందర్భంలో నవ్వుతూ ''దానిదేముంది? కొందరు జన్మ చేత బ్రాహ్మణులు. మరికొందరు వోడచేత బ్రాహ్మణులు'' అన్నారట.వోడచేత బ్రాహ్మణు లేమిటనిపించవచ్చు. దానికో పూర్వగాథ ఉంది. షుమారు రెండు శతాబ్దాల క్రితం ఆంగ్లేయులు బీహారు తదన్యప్రాంతాలనుండి నిర్బంధంగా ఒక ఓడలో ఎందరో భారతీయులను ట్రినిడాడ్ మున్నగు దేశాలకు కూలీపనుల నిమిత్తం తీసుకుపోయినారు. అందులో అన్ని కులాలవారు ఉన్నారు. చాలామంది ఆంగ్లేయుల పెత్తనాన్ని నిరసించిన స్వాతంత్ర్యపిపాసులు. ఆంగ్లేయులు వారినావిధంగా శిక్షించారు. వారు సమైక్యంగా నిలిచి తమ సంస్కృతీ ధర్మాలను నిలుపుకుంటూ – ఆ ఓడలో ఉన్నప్పుడుగాని, దిగిన తర్వాతగాని మతధార్మిక విధులను పరస్పరం సహకరించుకుంటూ నిర్వహించుకున్నారు. బ్రాహ్మణులు కాని వారు సైతం తమకు తెల్సిన పద్ధతిలో ప్రక్కవారిచేత పూజాదికాలు జరిపించడంలో సాయపడేవారట''. ఆవిధంగా వారు ''నౌకలో బ్రాహ్మణులైనారు. వారికి కులంపట్టలేదు. సంస్కృతీధర్మాలు ముఖ్యం. ఆ విధంగా ఆ పరాయి దేశంలో తమసంస్కృతీ ధర్మాలు ముఖ్యం. ఆ విధంగా ఆ పరాయిదేశంలో తమసంస్కృతిని పోకుండా నిలుపుకుంటూ వచ్చిన ధీరులు వారు.

అనంతరకాలంలో ట్రినిడాడ్ వస్తూ ఉండిన హిందువుల ద్వారా మరింత వ్యవస్థితంగా మతధార్మిక వ్యవస్థలను నిర్మించుకుంటూ వచ్చారు. కొంతకాలం క్రితం అక్కడ శివుని పేరిట

''ట్రినిడాడేశ్వర'' దేవాలయం నిర్మించుకున్నారట. అక్కడ నిరంతరం ప్రవహించే చక్కని నది ఒకటి ఉంటే, దానికి ''గంగానది'' అని పేరు పెట్టుకున్నారు. ఆ దేవాలయ ప్రోక్షణకు భారతదేశపు పవిత్రనదులన్నిటినుండి జలాలను తెప్పించుకున్నారు. ఆ నదీతీరం క్రమంగా అచటి హిందువులందరికి తీర్థస్థానవయింది. పర్వదినస్నానాలు, పూజలు తదన్యాలు నిర్వహించుకుంటున్నారు. అక్కడ వసతులు ఏర్పరుచుకుని వివాహములు, నామకరణాలు, అక్షరాభ్యాసాలు ఇత్యాదులన్నీ భక్తిశ్రద్ధలతో నిర్వహించుకుంటున్నారు. విశేష ఉత్సవాలు, భారతీయ పురాణేతిహాసాలకు చెందిన ప్రవచనాలు, భజనలు నాటకాలు ఇత్యాదులు విస్తరించుకుంటున్నారు. హిందూ దేవీదేవతలు, ఋషిమునివర్యులు, పండుగలు పబ్బాలు - ఇత్యాదులను పరిచయం చేసుకునే పుస్తకాలు ముద్రించు కొని తమ సంతానాన్ని హిందూ సంస్కృతీ సంప్రదాయాలలో పెంచి పోషించుకుంటున్నారు. 1834లో బానిసత్వం తొలగించుకున్నారు. ఈ మధ్యనేవారు 150వ స్వతంత్రదినోత్సవం జరుపుకున్నారు (1995లో) రాష్ట్రపతి శ్రీ శంకరదయాళ్ శర్మ కూడా వెళ్లి వచ్చారు. వారి సాంస్కృతిక ధార్మిక కార్యకలాపాలకు విశ్వహిందూ పరిషత్ ప్రభృతి సంస్థలు దోహదం చేయజొచ్చాయి. పరిషత్ సంఘటనాకార్యదర్శి శ్రీ బ్రహ్మాదత్ ఉపాధ్యాయ, శ్రీ దూబేప్రభృతి కార్యకర్తలు విశేష కృషి చేస్తున్నారు. ఇటీవల శ్రీ అశోక్‌జీ సింఘల్‌గూడా సందర్శించివచ్చారు.

ప్రధాని శ్రీవాసుదేవపాండేజి ఒక పేదబ్రాహ్మణ కుటుంబం. ఆయన తాతగారు క్రిందటి శతాబ్దాంతంలో అచటకి వెళ్లారు. అక్కడ స్థానికులతో కలిసి కష్టపడి పనిచేసి అచట ప్రముఖ కుటుంబాలలో ఒకరయినారు. శ్రీవాసుదేవపాండే కూడా వివిధ ప్రదేశాలలో విద్యాదికాలు సాగించి, ప్రజాసేవలకు, ట్రేడ్‌యూనియన్ సంస్థల్లోనూ పనిచేసి ప్రముఖులై క్రమంగా ప్రధాని అయినారు. తమ స్వగ్రామం ఉత్తరప్రదేశ్‌లోని అజాంఘర్ జిల్లాలో లక్ష్మణ్‌పూర్ అని తెలుసుకొని, తమ భారత పర్యటనలో ఆగ్రామ సందర్శనాన్నిగూడా ఏర్పాటు చేసుకున్నారు.

(కొలంబస్ తమ ప్రపంచయాత్రలో దక్షిణమెరికా ప్రాంతమున ఉన్న కెరేబియన్ ప్రదేశంలోని ఒక దీవిపై మూడు కొండలను చూచి దానికి ట్రినిడాడ్ అని పేరు పెట్టాడట. అదే భారతదేశం అనుకుని వారిని ఇండియన్‌లు అన్నాడట. వానికి పశ్చిమ దీవులను వెస్టిండీస్ అన్నాడట.) ట్రినిడాడ్ ఒక చిన్న దేశం. 13లక్షల జనాభా. అందులో 40 శాతం హిందువులు. మరో 40శాతం ఆఫ్రికాసంతతివారు. 20శాతం చైనా, బ్రిటన్, ఫ్రెంచి, డచ్, స్పానిష్ తదన్యజాతులవారు. అంతాకలిపి కట్టుగా జీవించడానికి ఉదాత్తహిందూ సంస్కృతి చాలా దోహదం చేసింది. దేశాన్ని వ్యవస్థితం కూడా చేసింది. దేశానికి అధ్యక్షుడు భారతీయ సంతతికి చెందిన శ్రీనూర్‌హసన్ ఆలీ. అంతా సమన్వయంతో జీవిస్తున్నారు. కావడానికి అది చిన్నదేశమే అయినా ఆర్థికంగాకూడా బాగా అభివృద్ధిచెందింది. కలిసి కట్టుగా అభివృద్ధి చెసుకున్నారు.

తొలిదినాల్లో అక్కడ బానిసత్వం విపరీతంగా ఉండేది. ఆఫ్రికాలోని నల్లజాతివారిని బానిసలుగా తెచ్చారు. వారు తమ మతం, భాష సంస్కృతీ కోల్పోయినారు. హిందువులు తమ సంస్కృతీ సభ్యత్వాలను నిలుపుకొని తాము జీవిస్తూ ఇతరులను జీవింపజేశారు. కష్టపడి జీవిస్తున్నవారికి

ఒక వరంగా అక్కడ చమురు గనిపడింది. ప్రపంచంలోని మొదట చమురుగని ట్రినిడాడ్‌లోనిదే. అక్కడి నుండి వారి ఆర్థిక పరిస్థితి బాగా మెరుగైయింది. ఇంకా అభివృద్ధి కోసం భారతీయ సంపన్నులను సంయుక్త పరిశ్రమలను నెలకొల్పేందుకు ఆహ్వానిస్తున్నారుట. చక్కని సంస్కృతి, ఆర్థికవసతులతో మరింత అభివృద్ధి సాధించేందుకు కృషి చేస్తున్నామని శ్రీదూబే ప్రభృతులు చెప్పారు.

దేశదేశాల హిందువులు తమపూర్వీకులను, వారసత్వాన్ని సాంస్కృతిక మూల్యాల అన్వేషణను జరుపుతున్న సందర్భంగా ప్రస్తావించదగిన మరొక మంచి విశేషం, ఇటీవల బెంగుళూరులో జరిగిన "రూట్స్-96" (Roots-96)అనే హిందూసంస్కృతీశిబిరం. డిశంబరు-జనవరి నెలల్లో 15రోజులు జరిగింది. విద్యార్థి పరిషత్, హిందూసేవాప్రతిష్ఠాన్ సంయుక్తంగా నిర్వహించాయి. ఎన్నెన్నో దేశాల నుండి హిందూ యువజనులు పెద్ద సంఖ్యలో తమసాంస్కృతిక మూల్యాలను, వారసత్వాన్ని అన్వేషించుకుంటూ తపన, జిజ్ఞాసలతో వచ్చారు. భారతదేశంలో ఉంటూగూడా, ఈ సంస్కృతీ ధర్మాలు సరిగా అందని ఎన్నో కుటుంబాల వారుగూడా వచ్చారు. వివిధ విషయాలలో నిష్ణాతులైన ప్రముఖులు వారి అధ్యయనంలో సాయపడ్డారు. మార్గదర్శనం చేశారు. శిబిరం అనుభవాలను గురించి చెప్తూ-కాలిఫోర్నియాకు చెందిన అనిల్‌కుమార్ తివారి ఇలా అంటారు: " ఇంతకుముందు నాకు హిందూత్వం అంటే ఏమంత తెలియదు. ఈ శిబిరంలో మంచి అవగాహన కల్గింది. హిందూత్వప్రబోధం, హిందూసాంస్కృతి సాధించిన విజయాలు, హిందూ ధర్మ మౌలిక సూత్రాలు పరిచయమైనాయి" అన్నారాయన.

న్యూజెర్సీకి చెందిన దేవాంగ్ వ్యాస్ అనే కంప్యూటర్‌సైన్స్ విద్యార్థి " ఒక హిందూ జీవనవిధానంలో నిమగ్నుణ్ణవుతాను" అన్నారు. అమెరికాలోని అక్రోన్‌కు చెందిన రష్మిగుప్త "హిందూత్వాన్ని గురించి ఇతరులకు చెప్పడానికి ఇక సంకోచించను. 1998లో మళ్లీ భారతదేశానికి వచ్చి ఇక్కడ సంఘ సేవలో కొంత పాల్గొనదలిచాను" అన్నాడు. ఇలాగే పలువురు తమ ఆనందాన్ని, సంకల్పాలను వ్యక్తం చేశారు. దేశ, దేశాల్లోని హిందువులు తమబిడ్డలను హిందూసంతతిగా వర్ధిల్ల జేసుకొవడం ఎలా అని ఆవేదన చెందుతుండేవారు. ఇప్పుడు క్రమంగా ఆ పరిస్థితులు మారుతున్నాయి.

★ ★ ★

## మనవాళ్ళు

దేశదేశాల హైందవేతరులలో గూడా హిందూత్వం పట్ల ఆసక్తి, అభిరుచి పెరగడం గమనార్హం. ఎందరెందరో సాధుసంత్‌లను ఆహ్వానించి ప్రసంగాలు చేయించుకుంటున్నారు. ఎందరెందరో హిందూదేశానికి వచ్చి ఈ సంస్కృతీ ధర్మాలను అలవరచుకొనడానికి ప్రయత్నించడం కూడా కనిపిస్తుంది.

ఈ పరిమాణానికి కారణమేమిటని ఒక పత్రికా ప్రతినిధి బీహార్ స్కూల్ ఆఫ్ యోగ అధ్యక్షులుగా నియుక్తులైన, స్వామిశ్రీ పరమహంస నిరంజనానందసరస్వతిని ఇటీవల ఇలా

అడిగారు: స్వామీజీ! మీకు ఐరోపా, ఆస్ట్రేలియా, ఉత్తరదక్షిణ అమెరికా దేశాలలో ఎందరో అనుయాయులున్నారు. ఆయాదేశాల సంస్కృతులకు చెందిన ఈ ప్రజలంతా క్రైస్తవ మహిమల సంప్రదాయంకన్నా హైందవ ఆధ్యాత్మికత వైపు ఎందుకు మొగ్గుజూపుతున్నారు?

అందుకు స్వామీజీ ఇలా జవాబిచ్చారు: ''పాశ్చాత్య దేశాలలోని భౌతికాభివృద్ధి వేగంవల్ల ప్రజలు తమ ఆధ్యాత్మిక మూల్యాలకు దూరమైనారు. వారు నిలవదొక్కుకొనడానికి ఆవశ్యకమైన పునాది లేకుండా పోయింది. ఇక భారతదేశంలో మా తాత్విక చింతనల ద్వారా సాధనా పూర్వక మైన జీవన సందేశం లభిస్తోంది. మేము చేసేదంతా సాధన, వేల సంవత్సరాలుగా సాధనా మార్గంలోనే పయనిస్తున్నాం. ఇదే ఆఖరి ముక్క అన్నట్లు ప్రకటించి వేయడం మా పద్ధతి కాదు. విస్తృతమైన చతుర్వేదాల వెల్లడి తర్వాత కూడా ఋషిమునివర్యులు ''నేతి, నేతి''(నా ఇతినాఇతి) ఇది కాదు ఇది కాదు. అదేదో అన్వేషించు. అంటూవేదాంత తత్వాన్ని అందించారు''

స్వామీజీమాట అర్థంచేసుకొనదగినట్టిది. రానున్న శతాబ్దానికి అడుగిడుతున్న ఈ దశలోనైనా ''మనవాళ్లు'' అర్థంచేసుకోవలసిన సందేమిది.

''ధర్మప్రియ''

## వార్త :

★ **బెల్లంపల్లి**: లో సరస్వతీమాత విగ్రహప్రతిష్ఠ, నూతన భవన ప్రారంభం, సరస్వతీ శిశుమందిర్ 28వ వార్షికోత్సవములు 11,12,13-2-97న జరిగినవి. సర్వశ్రీ శ.ల.న ఆచార్యులు, కె.వి.చి.సత్యనారాయణ, K.కిషన్‌రావుగార్లు కార్యక్రమాలలోపాల్గొని మార్గదర్శనం చేశారు. ముఖ్య అతిథి శ్రీ వి.కే.వాత్సవ గారు ఇతర పెద్దలు ప్రసంగించి కార్యక్రమాలు దిగ్విజయం చేశారని పాఠశాలప్రధానోపాధ్యాయులు తెలియజేశారు.

★ **కొత్తగూడెంలో** : మాఘ పంచమి (12-2-97)న వివేకానంద విద్యాలయంలో సరస్వతి పూజలొనర్చి, 42 మంది బాలబాలికలకు అక్షరాభ్యాసకార్యక్రమం నిర్వహించినట్లు పాఠశాల ప్రధానోపాధ్యాయులు తెలిపారు.

## సంతాపం:-



డా॥ తెలికిచర్ల కందాళం తిరువేంగళా చారిగారు. (30.8.1920 - 22.1.1997) (వి.హిం.ప. ఆంధ్ర ప్రాంత సంపర్క ప్రముఖ్ డా.(మేజర్) టి.కె.యన్ చారి గారి తండ్రి, మహారాష్ట్ర వ్యవసాయ కళాశాలలో ప్రొఫెసర్‌గా, ప్రిన్సిపాల్‌గా రిటైరై భాగ్యనగర్‌లో ఉంటూ విశ్వహిందూపరిషత్ ప. ఆంధ్ర, ధర్మాచార్య సంపర్క సమితి సభ్యులుగానూ అనేక సేవలందించారు. అలాగే సంఘం యోజించిన గ్రామ భారతి, మందిర భారతి కార్యక్రమాల రూపకల్పనలో సహకరించారు. వారు 22.1.97 దివంగతులైనారు. వారి ఆత్మ శాంతికై ప్రార్థిస్తూ.

'విశ్వహిందు'.

# "ఆదినుండి ఆధునికం వరకు స్త్రీ"

(గతసంచిక తరువాయి)

-డి. జి. విజయలక్ష్మి

11వ అధ్యాయంలోని 68వ మంత్రంలో మాతృస్థానంలో స్త్రీ ఏంచేయ్యాలో చెప్పబడింది. ''మా సుఖత్తా మాసురిషో అంబ'' ఇత్యాది మంత్రమునకు స్త్రీ తన సంతానమును పరస్పర ప్రీతివంతులుగా, వీరులుగా చేయవలెను. చేయతగినది చేయునట్లును, చేయకూడనిది చేయకుండునట్లును సుశిక్షణ గఱపవలెను అని భావం. అంటే తల్లి మొదటి గురువుగా బిడ్డకు సుశిక్షణ నివ్వాలని తెలియజేసే మంత్రమిది. '' ఏకా సుమాతా శిక్షకశత సమానయతి'' అన్నారందుకే! ఒక మంచి తల్లి వందమంది ఉపాధ్యాయులతోసమానురానల్నమాట. అయితే ఆమె భోదించదు. వాదించదు. చిన్న చిన్న మాటలతో, ఎన్నెన్నో కథలతో, ఆటలతో, పాటలతో, ముద్దుముద్దు పల్కులతో బుద్దులెన్నో నేర్పగలదు. ఆ ఓర్పునేర్పు ఆమెకతిసహజం. అందులోనే ఆమెకానందం. ఒకరైతు పొలందున్ని విత్తనాలు చల్లి, అవి మొలకెత్తాక అందులో కలుపుమొక్కలేరేసి, ఎరువు వేసి ఏపుగా పెరగటానికెంత కృషి చేస్తాడో, అంతటి కృషి ఆ తల్లికూడ చేస్తుంది. తన బుద్ధి అనే నాగలితో పిల్లల మనో క్షేత్రాల్ని దున్ని, సంస్కార బీజాలు నాటి, అవి మొలకెత్తాక, చెడు స్నేహాలనే కలుపుమొక్కల నుండి వేరు చేసి పెంచితే ఉత్తమాభిరుచులతో ఉద్దండుడౌతాడు. యుక్తాయుక్త వివేచన కల్గి ఉత్తముడౌతాడు. ఆమె అంతరంగానికి ప్రతిబింబమౌతాడు. అయితే అలాంటి తల్లి ఎలాటి విద్యావంతురాలైవుండాలి అనేది కూడ అనేక మంత్రాల్లో వివరించబడింది.

14వ అధ్యాయంలో మొదటి మంత్రము స్త్రీలకొరకు చెప్పబడింది. ''ధ్రువ క్షితి ర్ధ్రువ యోని ర్ధ్రువాసి ధ్రువం యోని మాసీద సాధుయా। ఉఖ్యస్య కేతుం ప్రథమం జుషాణా అశ్వనాధ్వర్యూ సాదయతా మిహత్వా''-అంటే అధ్యాపికలు, ఉపదేశికలగు విదుషీమణులు కన్యలను బ్రహ్మచర్య కాలము నందే శ్రేష్ఠధర్మ శిక్షణ గృహాశ్రమ శిక్షణ గఱపి వారిని శ్రేష్ఠురాండ్రుగనొనర్చవలయును అనిభావం. అంటే ఆనాడు గురుకులాలు స్త్రీలే నిర్వహించేవారిని, బాలికలకు శిక్షణ నిచ్చేవారని తెలుస్తుంది. అలాగే కులాయినీ, ఘృతవతీ.... ఇత్యాది మంత్రమునకు స్త్రీలు విద్వత్సంగము, శాస్త్రాభ్యాసము నిరంతరమొనర్చు చుండవలెనని, సాంగోపాంగముగ పూర్ణ విద్య నభ్యసించి స్వసదృశపతులను వివాహమాడవలెను అని అర్థం. అంటే చదువుకున్న తర్వాతే వివాహం. పూర్ణ విద్య అంటే యుక్తవయస్సు వచ్చేవరకు చదవాలి. బాల్యంలోనే పూర్ణవిద్యావంతులు కాలేరు కదా! కనుక బాల్యవివాహాల ప్రసక్తే లేదా కాలంలో. విద్య పూర్తయాక స్వసదృశులు అంటే తమకు సమానులు, సాటివారిని చేసుకోవాలని మంత్రోక్తి. అందులోనే 14వ మంత్రములో స్త్రీ బ్రహ్మ చర్యాశ్రమము చే తాను విదుషియై శారీరకాత్మిక బలముల వృద్ధికై స్వసంతానమునకు నిరంతరము విజ్ఞానమునొసగవలెనని చెప్పబడింది. పృథివ్యాఃపురీష మస్యప్సోః- ఇత్యాది మంత్రమునకు గృహాశ్రమ విద్యయందును, విద్యా కౌశలమునందును, విదుషీమణులైన స్త్రీలే సకల ప్రాణులకు సుఖము చేకూర్చ గలరనే భావం సువ్యక్తం. స్త్రీలు విద్య నేర్వటమే కాదు ప్రత్యేకంగా వైద్యవిద్య నేర్వాలని చెప్పే మంత్రమిది ''యాఓషధీః సోమరాజ్ఞీర్బహ్వీః శత విచక్షణాః.....'' (11వ అ.92వ మంత్రం)

అదే అధ్యాయంలో 48వ మంత్రంలో-

" ఓషధయః ప్రతిగృహ్ణీత పుష్పవతీః సుపిప్పలాః అయంవో గర్భ ఋత్వియః ప్రత్నమ్ సధస్థ మా సదత్" - అనగా ఓ స్త్రీ లారా! మీరు శాస్త్రముల చదివిన తర్వాత తప్పక వైద్యవిద్యనభ్యసించ వలెను. రోగనాశకములు, గర్భస్థాపకములు అగు ఓషధులనెరిగి, సుసంతానమును గని, ఆనందమను భవించుడు అని భావము. వ్యాకరణాది శాస్త్రములతో బాటు వైద్యశాస్త్రము కూడ తప్పకనేర్వాలని, అపుడే తన సంతానాన్ని కుటుంబాన్ని ఆరోగ్యవంతులుగ సరిదిద్దగలరని, ఓషదీగుణములను నిశ్చయముగ గ్రహించగలరని చెప్పబడింది. యజుర్వేదంలో ఆరోగ్యమునకు సంబంధించిన మంత్రములుకూడా ఎక్కువగానున్నవి. అంతేకాదు - 17వ అధ్యాయం 45వ మంత్రార్థమును గమనిస్తే-" అవసృష్టాపరాపత శరవ్యే బ్రహ్మసశితే" ఇత్యాది మంత్రమునకు, సభాపత్యాదులు యుద్ధ విద్యచే పురుషులను సుశిక్షితులనొనర్చినట్లే స్త్రీలను కూడ సుశిక్షితురాండ్రుగనొనర్చవలెను అని అర్థం. వీరపురుషుల వలె స్త్రీలును వీరవనితలుగ రణమొనర్చవలెనని తెల్పుచున్న మంత్రములు కూడ నున్నవి.

ఇక వివాహ విషయంలో ఈనాడు 18సం॥నిండాలనే నియమమున్నట్లే, ఆనాడు విద్యాగ్రహణానంతరం యువతికి వివాహం చేసేవారుగాని బాల్యవివాహాల ప్రసక్తే లేదు.

"అదితిష్ట్వాదేవీ, విశ్వదేవ్యావతీ పృథివ్యాః.... ఇత్యాది 11వ అధ్యాయంలోని 61వ మంత్రమునకు వివాహమునకు పూర్వమే విదుషీమణులు బాలికలకు ఉత్తమ విద్య గరిపి, ఓషధుల రసమువలె సంస్కారవతులుగ నొనర్చెదరుగాక అని చెప్పబడింది.

విద్యాబుద్ధులు గఱిపిన తర్వాతే వివాహంప్రస్తావించబడింది. అదికూడ పరస్పర అంగీకారము తర్వాత వధూవరులు వివాహమాడనిశ్చయించుకొనునపుడు, తల్లిదండ్రులు, గురువులు చక్కగా పరీక్షించివారికి వివాహము చెయ్యవలెనను విషయము 11వ అధ్యాయములోని 63,64మంత్రముల పరికించిన తెలియగలదు. ఇక్కడ వధూవరుల అంగీకారం, పెద్దల అనుమతి కూడ చెప్పబడింది.

అంతేకాదు స్వయంవర వివాహాలుకూడ ప్రోత్సహించబడ్డాయా కాలంలో. "చిదపి తయా దేవతయా అంగిరస్వత్ ధ్రువాసీద।పరిచిదపి తయా దేవతయా అంగిరస్వత్ ధ్రువాసీద" అనుమంత్రము 12వ అధ్యాయంలో 53వది.

ఓ కన్యలారా! మీరు పూర్ణ బ్రహ్మచర్యముతో సంపూర్ణ విద్యను పొంది యువతులై, స్వతుల్యులగు వరులతో, స్వయంవర వివాహమాడి, ధ్రువురాండ్రుకండు అని భావం. అంటే ఇందులో విద్యకు ప్రాధాన్యత, యుక్తవయస్సు తర్వాత వివాహం, అదికూడ స్వయంగా వరన్నిర్ణయం, ఆహా! స్త్రీలకెంతస్వేచ్ఛా స్వాతంత్రాలుండేవానాడు అని తల్చుకుంటేనే ఆనందంతో ఉర్కలేస్తుంది మనసు. అది ఈ జన్మలో మనం చూడ గలమా! విద్యావిషయంలో స్వేచ్ఛ వుండవచ్చుగాని, వివాహ విషయంలో స్తోమతను బట్టి వరులను కొనుక్కుంటున్న కాలమిది. స్వయంవరాల గురించి కథల్లో వినవలసిందే! కాన్వెంట్ చదువులవారికి ఆ అవకాశం కూడ వుండదు. వేదకాలం స్త్రీ జనాళికి స్వర్ణయుగం. పైగా స్త్రీ ఎలాటి వరుని కోరుకోవాలో కూడ తెల్పే మంత్రాలున్నాయి. స్వయంవరమంటే అందము, ఆకర్షణ చూడటమేకాదు. అతనిలో ఎలాటి సుగుణాలుండాలో చూడమని హెచ్చరించే మంత్రాలివి. (సశేషం)

# ప్రాంత ధర్మాచార్య సమ్మేళనం (ప. ఆంధ్ర)

23-2-97 ఉదయం నుండి సాయంత్రం 7 గం॥ వరకూ పశ్చిమాంధ్రలోని విహిం.ప.కార్యాలయం, కోఠిలో ధర్మాచార్యులు సమావేశమై నేటి రాజకీయ, ధార్మిక, సామాజిక సమస్యలపై చర్చించి ఏడు తీర్మానాలు చేశారు.

**తీర్మానం:- 1**. ప్రాంతధర్మాచార్యులు సప్తమ ధర్మ సంసద్ తీర్మానాలు ఆమోదిస్తూ మధురలోని శ్రీ కృష్ణజన్మ స్థానం విముక్తికై గ్రామగ్రామాన ధర్మ సభలు, ఊరేగింపులు నిర్వహించి మధుర క్షేత్ర మహిమను ప్రజానీకానికి విశదపరచవలెను.

**తీర్మానం:- 2**. హిందూ దేవాలయాల యథాతథ స్థితి చట్టం హిందువులందరికి అవమానకరమైనది. మధుర, కాశీ మందిరాల చుట్టూ ఉన్న అపరిమితమైన పోలీసు బలగాలను తొలగించి వేలాది భక్తుల అసౌకర్యాన్ని తొలగించాలని కేంద్ర, ఉ.ప్రదేశ ప్రభుత్వాలను కోరడమైనది.

**తీర్మానం:- 3**. రాజ్యాంగములోని గోహత్యానిషేధ చట్టం కేవలం నామమాత్రంగా మిగిలి పోయింది. ఆ చట్టాన్ని ఖచ్చితంగా అమలుపరచాలి. బక్రీదునాడు ముస్లింలు సుప్రీం కోర్టు తీర్పును ధిక్కరిస్తూ గోవును బలిచే సేదుశ్చర్యలను ప్రభుత్వం తక్షణం ఆపాలి.

**తీర్మానం:- 4**. హిందూ దేవాలయాల ఆస్తులు వాడుకోవడం, భూములు వేలం వేసి అన్యాక్రాంతం చేస్తున్నయీ ప్రభుత్వం చర్చీలు, మసీదులను స్వేచ్ఛగా వదిలివేయడం ఖండిస్తూ, దేవాలయాల నిర్వాహణ ధార్మిక మండలి కప్పగించవలెను.

**తీర్మానం:- 5**. తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వహణ రాజకీయమయమై ఆలయ సొమ్ము రాష్ట్రప్రభుత్వం తిరుపతి డ్రేనేజి మొ॥కార్యాలకు ఉపయోగించడం భక్త కోటి సహింపదు. ఈ మధ్య రాష్ట్ర ముఖ్యమంత్రి తమ సౌకర్యార్థం దేవాలయపూజలను నిర్దిష్ట సమయానికి ముందే జరిపించి తమ అధికారం దుర్వినియోగం చేయడం వుండెన్నడూ కాకూడదని తీర్మానించడమైనది.

**తీర్మానం:- 6**. ప్రభుత్వ ధర్మనిరపేక్ష, ముస్లిం సంతృప్తీకరణవిధానాల వల్ల, ముస్లింలు, క్రైస్తవులు హిందూ వ్యతిరేకవిధానాలతో మభ్య పెట్టి, భయపెట్టి హిందువులను తమ తమ మతాల్లో చేర్చుకోవడం వల్ల హిందూ సమాజం బలహీనమై పోతున్నది గాన మత మార్పిడి కార్యకలాపాలు ప్రభుత్వం తక్షణం నిషేధించాలి. అని తీర్మానించడమైనది.

**తీర్మానము:7**. ఇటీవల గుజరాత్ప్రభుత్వం ఆప్రాంత వి.హిం.ప.ప్రధానకార్యదర్శిని ముస్లింలను సంతృప్తి పరచే రాజకీయంతో అరెస్ట్ చేయడం ఖండిస్తూ, ఈ అవివేకపు చర్య తమకే త్రిప్పికొట్టగలరని, ప్రధాన కార్యదర్శిని తక్షణ విడుదల చేయాలని ధర్మాచార్యులు తీర్మానించారు.

పై సమ్మేళనంలో అధిష్టించి తీర్మానాలు చేసిన ధర్మాచార్యులు ప.పూ. శ్రీ శ్రీ కృష్ణానంద మఠస్వామి, దిల్‌సుఖ్‌నగర్.

॥ సంగ్రామ మహరాజ్ - మెదక్ (జి) కొండాపురం.
॥ మోక్షానందస్వామి - తిమ్మాపురం (నిజామాబాద్ -జి).
॥ రామేశ్వరా నందగిరిస్వామి - గాంధినగర్ - హైద్రాబాద్.
॥ బసవేశ్వరా నందస్వామి - మహేశ్వరం - రంగారెడ్డి (జి)
॥ విశ్వం భరానందస్వామి - హైద్రాబాద్
॥ అమలానంద స్వామి - కర్నూలు

మాతా ॥ నిర్మలయోగానందజీ - మెదక్ (జి)
స్వామిజీల సందేశాలతో సభముగిసింది. వి.హిం.ప. కార్యాధ్యక్షులు శ్రీ శర్మ, ప్రధాన కార్యదర్శి శ్రీ గుండేరావు గార్లు కార్యక్రమం నిర్వహించారు - సమ్మేళనంలో వి.హిం.ప. ప్రాంత కార్యకర్తలు, పెద్దలు పాల్గొన్నారు.

ప్రాంత ధర్మాచార్య సంపర్క ప్రముఖ్

---

(ఆంధ్రవీరులు)

# ఆంధ్రకేసరి

- రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

[జనవరి1997 సంచికతరువాయి -5]

తానకె పద్దెనిమ్మిదొందల తొంబదొకటి
వయసు యిరువది యొక్కటి వచ్చిపడియె
నాటకములవ్వి, యటులనే నడచుచుండె
ధ్యాసపుట్టెను న్యాయశాస్త్రంబు జదువ

అంతకుఁబూర్వమె " ఎఫ్, ఏ"
పంతముతోఁబూర్తి జేసి బరగుటకతనన్
సంతసమొప్పగఁజదివె, వ
లంతిగ మద్రాసునగర లాకాజిన్

గ్రేడు కొఅకు పట్టుబట్టి చదివె
కాని దక్కొమఅసె కండుగ్రేడు
సర్టిఫికెటు వచ్చె, సంతసమొప్పార
ప్లీడరగుచుపెద్ద పేరుఁబొందె

ఒంగోలునందున నొంప్రథమంబుగా
ప్రాక్టీసు జేయుచుఁబ్రదితుడయ్యె
రాజమంద్రినగర రాజంబునకుఁజేరి
వాసికెక్కిన న్యాయవాది యయ్యె
ఆ మున్సిపాలిటీ యధ్యక్షుడైతాను
రాజకీయములందురాటు దేలె
పరగ లండను వెళ్ళి బారిష్టరీ జేసి
జగజెట్టి తనమును సంతరించె
చెన్నపట్టణమందునఁజేవదేఅ
యెనయ పందొమ్మిదొందల యేడునుండి
వరుసపదునాలుగేడులు, తిరుగులేని
ప్లీడరనఁబ్లీడరై, పెద్దవెల్గుజిమ్మె.

(సశేషం)

# • దేశవ్యాప్తంగా విశ్వహిందూ పరిషత్ సేవా కార్యక్రమాలు

విశ్వహిందూపరిషత్ ఆరోగ్యం, విద్య, కేంద్రాలు, అనాథశరణాలయాలు, వయోవృద్ధ సంస్థలు మొదలైనవెన్నో ప్రకల్పాలు దేశవ్యాప్తంగా నెలకొల్పిసేవాకార్యాలు నిర్వహిస్తున్నది:

**ఆరోగ్యం :**

ఇప్పటివరకూ దేశవ్యాప్తంగా 12 ఆధునిక ఆసుపత్రులు, 5సంచార ఆసుపత్రులు, 250 డిస్పెన్సరీలు నెలకొల్పింది. అస్సాంలోని ఆఫ్లాంగ్ ఆసుపత్రి డాక్టర్లు పరిసర గ్రామాలలోని వనవాసి, గిరివాసీబంధువుల వద్దకు క్రమము తప్పకుండా వెళ్ళివారి సమస్యలు తీరుస్తున్నారు.

పశ్చిమబెంగాల్‌లోని మాల్డా, ముర్షిదాబాద్ జిల్లాలో 175 హోమియోపతి చికిత్సా కేంద్రాలు వి.హిం.ప.నడుపుతున్నది.

అక్కడ టీ గార్డెన్స్‌లో 50 కేంద్రాలు గలవు.

కర్నాటక, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రలలోని గ్రామీణ ప్రాంతాలలో సకల సౌకర్యాలతో ఆధునిక అసుపత్రులు ప్రారంభింపబడినవి.

పంజాబ్‌లోని కొట్యాపుర, గుల్బర్గాలలో కుష్ఠురోగుల బిడ్డలకై ప్రత్యేకమైన హాస్టళ్ళు నెలకొల్పి ఆపిల్లలకు విద్య, ఆహార సౌకర్యాలు కల్పింపబడ్డాయి.

యోగ, నేత్ర, ఆరోగ్య క్యాంపులు గూడ పెద్ద ఎత్తున నిర్వహింపబడుతున్నాయి.

**విద్య:**

విద్యావిహీనతవల్ల దళితులు, వనవాసీలు అనేక బాధలకు గురిఅవుతున్న విషయం గుర్తించి వి.హిం.ప విద్యాసౌకర్యాలు కల్పిస్తున్నది.

ప్రస్తుతం 150 పాఠశాలలు, 374 వయోజన విద్యాకేంద్రాలు, 86 శిక్షణ కేంద్రాలు నడుపబడుతున్నాయి. మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్ ఆంధ్రప్రదేశ్, కర్నాటక, బీహార్, రాజస్థాన్‌లలోని వనవాసీ ప్రాంతాలలో 'ఏకోపాధ్యాయపాఠశాలలు' వి.హిం.ప అనేకం నడుపుతున్నది.

తమిళనాడులో 25 హిందూ కాన్వెంట్ స్కూళ్ళు నడుపబడుతున్నాయి. ఈశాన్యరాష్ట్రాలైన నాగ, దిమస, రియాంగ్, త్రిపుర మరియు ఇతర వనవాసీ, గిరివాసీ విద్యార్థులలో జాతీయ భావన కల్పించే విద్యావిధానం అమలు పర్చబడింది.

పశ్చిమ బెంగాల్లో 41 రాత్రిపాఠశాలలో హిందూ యువకులకు, రాజస్థాన్‌లోని 2వేల భిల్లు బాలురకు విద్యా సేకర్యాలు కల్పించబడ్డాయి.

వి.హిం.ప. హాస్టళ్ళలో 4వేల మంది వనవాసి, గిరివాసీ విద్యార్థులకు ఉచిత విద్య, ఆహారం అందించి, వారికి మంచి భవిష్యత్ కల్పిస్తున్నది. 16 అనాథశరణాలయాల్లోనూ 5 కర్నాటకలో ఉన్నవి. శరణాలయాలింకా ఎక్కువకాబడుతున్నాయి.

**ఇతర ప్రకల్పాలు:**

దేశవ్యాప్తంగా వి.హిం.ప. 80 శిక్షణాకేంద్రాలలో ప్రతిసంవత్సరం 2 వేలమంది మహిళలకు 'కుట్టు' పనిలో శిక్షణనిస్తున్నది.

తమిళనాడులో దళిత వాడలలో 150 దేవాలయాలు నిర్మించబడినవి. 'ధర్మరథం' దళిత ప్రాంతాలలో 12 వేల కి.మీ. దూరం ధర్మబోధచేస్తూ ప్రయాణిస్తున్నది.

అవసరమైన ప్రదేశాలలో సంస్కారకేంద్రాలు, ఉయ్యాలకేంద్రాలు, పసిబిడ్డలకు రక్షణ కేంద్రాలు ఏర్పాటు చేయడం వి.హిం.ప. యొక్క ఇతర సేవాకార్యక్రమాలుగా ఉన్నాయి.

– బాలకృష్ణనాయక్

# ఫరూక్ నోట పాకిస్తాన్ మాట!

కాశ్మీర్‌లో సగభాగం పాకిస్తాన్ కివ్వాలట,
ఫారూక్ అబ్దుల్ల నోట ప్రతిసారీ ఇదే మాట!
'ప్రత్యేకత' పేర తనకు జాగీర్, మిగిలిన భాగం,
విద్రోహానికి పట్టం కట్టినందుకిదేఫలం!!

జమ్మూకాశ్మీర్ ముఖ్యమంత్రి ఫరూక్ అబ్దుల్లాకు ఓ పగటికల నిరంతరం వస్తూ ఉంటుంది, ప్రధానమంత్రి కావాలని – భారతదేశానికి కాదు – అధికారం పోయినప్పుడల్లా తాను వెళ్ళినివసించే బ్రిటన్‌కూ కాదు. – మరి ఏదేశానికి? 'కాశ్మీర్'కు ప్రధానమంత్రి కావాలని ఆయనతహతహ! అందుకే ఆయనొరకరకాల ప్రతిపాదనలు చేస్తూ వస్తున్నారు. ఇస్లాంమతోన్మాదం కక్కుతున్నారు. ఫిబ్రవరి నెలలో ఆయన ఒక 'గొప్పప్రతిపాదన' చేశారు. కాశ్మీర్ విషయమై భారతపాకిస్తాన్‌ల మధ్య అంగీకారం కుదరడానికి వీలుగా పాకిస్తాన్ 1947లో ఆక్రమించుకున్న కాశ్మీర్ భూమిని పాకిస్తాన్‌కే వదలిపెట్టాలట! (''అదేమిటి? మూడు సార్లు మనతో యుద్ధంచేసి చావుతప్పి కన్ను లొట్టపోయిన పాకిస్తాన్ అనవలసిన మాట భారతదేశంలోని ఒక రాష్ట్రం ముఖ్యమంత్రి అంటున్నాడు'' అని ఈ దేశప్రజలు అనుకోవచ్చు కానీ మతోన్మాదాన్ని పెంచి పోషించిన కాంగ్రెస్, కమ్యూనిష్టు, జనతాదళ్ తదితర కుహనా లౌకిక వాదులు మాత్రం ఫరూక్ ప్రకటనకు ఏ మాత్రం ఆశ్చర్యపోలేదు. ఎందుకంటే ఫరూక్ అబ్దుల్లా, ఆయన తండ్రి షేక్ అబ్దుల్లా భారతదేశానికి వ్యతిరేకంగా నడుపుతున్న, నడిపించిన కుట్రల సంగతి వీరికి బాగా తెలుసు. ఈ కుట్రదారులను కాశ్మీర్ గద్దె వెక్కించి విద్రోహాన్ని పెంచి పోషించింది జవహర్‌లాల్ నెహ్రూ, ఆయన రాజకీయ వారసులు!

ఫరూక్ అబ్దుల్లా ప్రకటన జాతీయ వాదులు విమర్శించారు. కొంతమంది పత్రికా ప్రతినిధులు నిలదీశారు! కానీ అబ్దుల్లా గారు హడలిపోలేదు! '' ఈప్రతిపాదన కొత్తది కాదు. 1972లో కుదిరిన సిమ్లా ఒప్పందం సందర్భంగా ఈ ప్రతిపాదనను శ్రీమతి ఇందిరాగాంధీ, అప్పటి పాకిస్తానీ నియంత భుట్టో చర్చించారు'' అని ఫరూక్ అబ్దుల్లా సమాధానం చెప్పారు. '' ఔను కాబోలు!'' అని దేవెగౌడ సర్కార్ మిన్నకుండిపోయింది!

ఫరూక్ ప్రతిపాదన దేశద్రోహకరం. ఇలాంటి మాటలు మాట్లాడినందుకే వీరి తండ్రి షేక్ అబ్దుల్లాను భారతప్రభుత్వం 1953లోను, 1965లోను భారతప్రభుత్వం షేక్ అబ్దుల్లాను అరెస్టు చేసింది. పదవినుంచి తొలగించింది. కానీ నేటి స్థితి?? ఇందిరాగాంధీ, భుట్టో ఇద్దరూ లేరు. స్వర్గస్థులో, నరకస్థులో అయినవారు ఇది మాట్లాడనట్లు, తానువిన్నట్లు భూలోకస్వర్గాన్ని నరకంగా మార్చిన ఫరూక్‌గారు సెలవిస్తున్నారు. 1983లో ముఖ్యమంత్రిగా పట్టాభిషేకం జరగటానికి కొంత కాలం క్రితం వరకూ బ్రిటన్‌లో అనేక ఏళ్ళ పాటు 'డాక్టరీ' చదివు 'కొని',సుల్తాన్‌లా జీవించిన ఫరూక్ అబ్దుల్లా అప్పటి నుండి ఇప్పటి వరకూ ప్రతి ఎన్నికలోను భారతవ్యతిరేక, జాతి వ్యతిరేక, హిందూవ్యతిరేక ప్రచారంలో ఇస్లామిక్ తీవ్రవాద ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు.

రెండేళ్ళ క్రితం బ్రిటన్ నుంచి తిరిగి రాగానే అబ్దుల్లా ఇదే ప్రకటన చేశారు. అప్పుడు కూడ మనదేశంలో ఎవరూ ఈ ప్రకటనను (ప్రభుత్వంతరపున) ఖండించలేదు. పైగా, '' ఈసారి ఫరూక్ గారు తన కుటుంబ సభ్యులను కూడ భారతదేశానికి పిలుచుకుని వచ్చారు. కాశ్మీర్‌లో ప్రజాస్వామ్య ప్రక్రియకు ఇది శుభ సూచకం'' అంటూ రాజకీయ విశ్లేష వ్యాఖ్యాన రచయితలు

హర్షం కూడ వెలుబుచ్చారు. కానీ ముఖ్యమంత్రి పదవిని రెండుసార్లు అనుభవించి, కాశ్మీర్‌లో మంటలు సృష్టించి వెళ్ళిపోయిన ఈయన గారు ఇన్నాళ్ళు విదేశాల్లో ఏమి 'వెలగబెట్టారని' ' ఎవడూ' ప్రశ్నించడు!

నిన్నమొన్న, ''కాశ్మీర్‌లో సగం పాకిస్తాన్‌కు ఇవ్వాలని'' అబ్దుల్లా అనగానే పాకిస్తాన్ దీన్నితోసి పుచ్చింది (అంతా కావాలట!). కాశ్మీర్‌ను స్వతంత్ర దేశం చేయాలనే 'కాశ్మీర్ లిబరేషన్‌కౌన్సిల్' గుండాలు సైతం లండన్ నుండి ఒక ప్రకటన చేస్తూ ఫరూక్‌పై దుమ్మెత్తిపోశారు. కానీ మన కేంద్ర ప్రభుత్వం మాత్రం చలనం లేని దిమ, నీరెత్తిన నిమ్మ!

''సగం చిక్కినా, సుల్తాన్     అబ్దుల్లా దొరగారు!''
మనకెందుకు లెమ్మంటూ     మిన్నకుంది గొడనోరు!
పదవీభోగం జీవిత     పరమార్థం ఐనతీరు,
పాకిస్తాన్ తొత్తులపై     చల్లుతోంది పన్నీరు!!

కాశ్మీరు హిందువుల ఆస్తులను పాకిస్తానీ తొత్తులు కాజేస్తున్న విధానానికి మాననీయ కోటేశ్వర శర్మగారు గత సంచికలో ఒక ఉదాహరణ ఇచ్చారు. అంతేకాదు గత పదేళ్ళుగా లడఖ్‌ప్రాంతంపై దురాక్రమణ సాగుతోంది. అక్కడ ఆస్తులను ఆక్రమించడమే కాక అభం శుభం తెలియని అమ్మాయిలను దిగమింగుతున్నారు. హిందూబాలికలను కిడ్నాప్ చేసి ముస్లిం గుండాలకు కటబెడుతున్నారు. ఈ చర్యలకు ఫరూక్ అబ్దుల్లా ప్రభుత్వం, పోలీసులు మద్దతునిస్తున్నారని 'మైఫ్రోజన్ టర్బులెన్స్ ఇన్ కాశ్మీర్' అన్న గ్రంథంలో కాశ్మీర్ గవర్నర్‌గా పనిచేసిన శ్రీజగ్ మోహన్ వివరించారు. ఈ దుశ్చర్యలను ఆపించడానికి గవర్నర్ చేసిన ప్రయత్నాలకు కాశ్మీర్‌లోని అబ్దుల్లా అనుచరులతో ఆటంకాలు కల్పించారు. లఢక్ ప్రాంతంలోని మెజారిటీ హిందువులను మైనారిటీలుగా మార్చి వారిని సైతం కాశ్మీర్ హిందువుల గతి పట్టించడానికి జరుగుతున్న కుట్రను ఫరూక్ ప్రభుత్వమేనడిపిస్తోంది. లడఖ్‌ను రెండు జిల్లాలుగా విడగొట్టారు. ఇది పదేళ్ళ క్రితం జరిగింది. ఫలితంగా ప్రస్తుతం కార్గిల్ జిల్లా ముస్లిం మెజారిటీ జిల్లాగా మారిపోయింది. రెండవదశలో అజిల్లాలో అక్కడ నుండి హిందువులను తరిమివేస్తారు. లేదా నరికివేస్తారు. హిందూ వధువులను ఇస్లామిక్ గుండాలకిచ్చి 'పెళ్ళి' చేస్తారు. కార్గిల్, లే ప్రాంతంలోని హిందువులనైనా కాపాడడం సాధ్యమవుతుందా?

(క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్దంలో కాశ్మీర్ రాజుతో రమాణుడు మరణిస్తాడు. అతనికుమారుడు పసి బాలుడు. అందువల్ల ఆ బాలుడు పెరిగి పెద్దయ్యేవరకూ తమకు ఒక రాజును పంపమని చక్రవర్తి విక్రమాదిత్యున్ని కాశ్మీర్ ప్రజాప్రతినిధులు ప్రార్థిస్తారు. ఉజ్జయినికి దూతలను పంపిస్తారు. మాతృగుప్తుడు కాశ్మీర్ రాజుగా వియుక్తుడౌతాడుజ

క్రీస్తుశకం ఇరవయ్యవశతాబ్దిలో కాశ్మీర్‌కు భారతదేశంతో సంబంధం ఉండరాదంటున్నారు కాశ్మీరీ పెత్తందార్లు, 'ప్రజాప్రతినిధుల' ముసుగులో ఉన్న పాకిస్తానీ ఏజెట్లు!

ఈ తేడాకు కారణం.....?     అప్పుడు హైందవ పరిమళ
సుమహారం కాశ్మీరం....     ఇప్పుడు హైందవ వీరుల
బలిపీఠం కాశ్మీరం...!     మళ్ళీ పరిమళ వనములు
పాదుకొనే దెప్పుడు? 'మాతృశిరం' పై 'గంగా'
జలం కురిసినప్పుడు!!

– తంగేడు కుంట హెబ్బార్



వి.హిం.ప పునరాగమన కార్యక్రమం - నల్కి వెంకటాపురం ( మిర్యాలగూడ జి. ) వార్తలోపలిపుటలలో



స్వధర్మంలోనికి తిరిగి చేరిన వారికి శ్రీ స్వామీజీ వస్త్రదానం చేస్తున్నారు.
( నల్కి వెంకటాపురం ) వార్తలోపలిపుటలలో